# పింజారి

## షేక్ నాజర్ ఆత్మకథ



(5-2-1920 ★ 21-2-1997)

సేకర్త :

**డా॥ అంగడాల వెంకటరమణమూర్తి**





విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్

విజయవాడ

**PINZARI** *(Shaik Nazar's Autobiography)*
*Collected by :* ***Dr. A.V. Ramanamurthy***

ప్రచురణ నెం. : 2350/628
ప్రతులు : 1000
ప్రథమ ముద్రణ : ఆగస్టు, 2016
టైటిల్ డిజైన్ : గిరిధర్



వెల : **₹ 65/-**

**ప్రతులకు**

**విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్**
33-22-2, చంద్రం బిల్డింగ్స్
చుట్టుగుంట, విజయవాడ-520004
ఫోన్ : 0866-2430302
Email : vphpublish@gmail.com

**విశాలాంధ్ర బుక్‌హౌస్**
విజయవాడ, విశాఖపట్నం,
అనంతపురం, గుంటూరు
తిరుపతి, కాకినాడ, ఒంగోలు
శ్రీకాకుళం, కడప, విజయనగరం



**ముద్రణ : విశాలాంధ్ర విజ్ఞాన సమితి ముద్రణాలయం - విజయవాడ**

# బుర్రకథ సామ్రాట్ నాజరు
# బుర్రకథకు మరో పేరు నాజరు

తెలుగు సాంస్కృతిక రంగానికి ప్రజానాట్యమండలి అందించిన ఆణిముత్యాలలో నాజరు ఒకడు. కొందరికి కళ పుట్టుకతోనే కొంత వుంటుంది. దాన్ని గుర్తించి ప్రోత్సహించటం వలన అది ప్రకాశిస్తుంది. తెనాలికి చెందిన హార్మోనిస్టు ఖాదర్ నాజర్‌లో వున్న గాయకుడ్ని గుర్తించి ప్రోత్సహించాడు. ప్రజానాట్యమండలి నాజర్‌లో వున్న కళాప్రతిభను గమనించి శిక్షణ యిచ్చి ప్రజల మధ్యకు తెచ్చింది.

నాజర్ గుంటూరు జిల్లా పొన్నెకల్లు గ్రామంలో కడుపేద కుటుంబంలో పుట్టాడు. "నాకు చిన్నతనంలో పక్కకు చింకిపాత కూడా వుండేదికాదు. మా అమ్మకు మారుచీర కూడా లేదు" అని నాజరే స్వయంగా చెప్పాడు.

నాజరు పుట్టిన పొన్నెకల్లు దూదేకుల కాలనీలో పందిరి గుంజలు పాటలు పాడుతాయని నానుడి. నాజర్ తండ్రి మస్తాన్ చెక్కభజనలో నేర్పరి, పెదతండ్రి నాజరు షహనాయి విద్వాంసుడు. ఆ వాతావరణంలో పుట్టి పెరిగిన నాజర్‌కు సంగీతంపైన ఆసక్తి చిన్నతనంలోనే వచ్చింది. పుట్టుకతోనే వచ్చిన మంచి గాత్రం.

పొన్నెకల్లులో శ్యామలరెడ్డి బాలుడుగా వున్న నాజర్‌తో కనకతార నాటకంలో వేషం వేయించాడు. ఆ ప్రదర్శనకు తెనాలి నుండి వచ్చిన హార్మోనిస్టు ఖాదర్ నాజర్‌లో వున్న గాయకుడ్ని గమనించాడు. తండ్రి మస్తాన్‌కి నచ్చజెప్పి తనవెంట తెనాలికి తీసుకెళ్ళి అక్కడున్న నాటక సమాజంలో చేర్పించాడు. అది కొంతకాలం తరువాత మూతపడటంతో నరసరావుపేట తీసుకెళ్ళి సంగీతం మాస్టారు దగ్గర చేర్పించాడు. అక్కడ తిండి సమస్య ఎదురైంది నాజర్‌కి.

సంగీతం గురువుగారు ఒకరోజు నాజర్ని "భోగం మేళం" వారి వీధికి తీసుకెళ్ళి వీధిలో నిలబడి "అమ్మా" అని కేకేశాడట. దానితో చుట్టూ వున్నవారు వాకిళ్ళలోకి వచ్చి నిలబడ్డారట. "అమ్మా! ఈ అబ్బాయి చక్కగా పాడతాడు. నేను సంగీతం నేర్పుతున్నాను. ఇతడికి తిండికి ఇబ్బంది వచ్చింది... రోజూ మీ ఇళ్ళకు వస్తాడు. కాస్త అన్నం ఇతడి జోలెలో వేయండి" అని విజ్ఞప్తి చేశాడట.

దానితో నాజర్‌కి తిండి సమస్య పరిష్కారమయింది. ఇలాంటి ఇబ్బందులెన్నో... అయినా పట్టు వదలలేదు నాజర్.

తండ్రి చనిపోయిన తరువాత కుటుంబ బాధ్యతలు పైపడటంతో నాజర్ వ్యవసాయ కూలీ పనులకు వెళ్ళసాగాడు. వారసత్వంగా వున్న గుడిలో సన్నాయి ఊదటం చేశాడు. అన్నతో కలిసి పండుగ సీజన్‌లో ఇంటింటికీ తిరిగి ధాన్యం అడుక్కున్నాడు. చివరకు కుట్టు మిషన్ నేర్చుకున్నాడు.

ఇన్ని చేస్తున్నా తనకు ఇష్టమైన, వంటబట్టిన సంగీతాన్ని వదలలేదు. ఎక్కడున్నా ఎటుపోతున్నా నాజర్ నోటివెంట పాట, పద్యం పరుగులిడుతుండేవి.

ఒకరోజు నాజర్ మిషన్ కుడుతూ గొంతెత్తి పాట పాడుతున్నాడు. అది చూచి ఒక రైతు "ఓరే నాజరా! నీలో నీవే పాడుకొనేకంటే మా పిల్లలకు సంగీతం నేర్పరాదటరా?" అని అన్నాడు. ఆ వెంటనే నాజర్ వారి పిల్లలకు హార్మోనియంపై సంగీతం నేర్పడం ప్రారంభించాడు. అప్పుడు నాజర్ దగ్గర సంగీతం పాఠాలు నేర్చుకున్నవాడే ప్రముఖ సినీ సంగీత దర్శకుడు కీ॥శే॥ చక్రవర్తి.

పొన్నెకల్లులో ఆర్య సమాజం, త్రిపురనేని రామస్వామి చౌదరి ఆలోచనలు, కమ్యూనిస్టు పార్టీ భావాలు ప్రవేశించాయి. ఎక్కువమంది యువకులు కమ్యూనిస్టు పార్టీకి చేరువయ్యారు. అందులో నాజర్ ఒకరు. ఒకరోజు కమ్యూనిస్టు పార్టీ నాయకులు వేములపల్లి శ్రీకృష్ణ పొన్నెకల్లు వచ్చి నాజర్‌ను గుంటూరు తీసుకెళ్ళారు. తురిమెళ్ళ నుండి రామకోటిని, తెనాలి నుండి పురుషోత్తాన్ని తీసుకొచ్చాడు. 'పార్టీ మీకు అన్నీ సమకూర్చుతుంది. ఆఫీసులో ఉండి బుర్రకథను నేర్చుకోమని' చెప్పాడు. వీరికి శిక్షకులు అప్పటికే కథకులుగా వున్న సూర్యనారాయణ, వెంకట సుబ్బయ్య, కాకుమాను సుబ్బారావు.

నాజర్ దళం తాము నేర్చుకొన్న టాన్యా బుర్రకథను విజయవాడ రైతు మహాసభలలో చెప్పగా బహుమతి వచ్చింది. ప్రజలు బాగా మెచ్చుకొన్నారు. దానితో గుంటూరు జిల్లా ప్రజానాట్యమండలి స్థాపించి విస్తృతంగా తిరిగి బుర్రకథ చెప్పడం ప్రారంభించాడు నాజర్. పూర్తికాలం ప్రజానాట్య మండలి కళాకారుడుగా, కమ్యూనిస్టు పార్టీ కార్యకర్తగా బుర్రకథలు చెప్పసాగాడు. స్వయంకృషితో పాటలు, బుర్రకథలు రచనలు కూడా చేయసాగాడు.

1948లో కమ్యూనిస్టు పార్టీపైనా, ప్రజానాట్యమండలిపైనా నిషేధాలు ... అరెస్టులు ... అజ్ఞాతవాసాలు. దానితో ప్రజానాట్యమండలి కకావికలయ్యింది. ఎవరికి వారే ... మద్రాసుకు కొందరు ... జైళ్ళలో కొందరు ... పోలీసు స్టేషన్ల చుట్టూ ... ఆర్థిక ఇబ్బందులు ... తగ్గిన ఆత్మస్థైర్యం ... పరిమిత సిద్ధాంత పరిజ్ఞానం. అన్నీ తోడై నాజర్‌ను కుంగదీశాయి. దానితో నాజర్‌కు తిరోగమన ఆలోచనలు వచ్చాయి. కుటుంబ మనుగడకోసం ఎవరు పిలిచినా వెళ్ళి కథలు చెప్పాలనుకొన్నాడు.

ఒకరోజు కాంగ్రెస్ నాయకుల సభలో కథ చెప్పడానికి సిద్ధమై వేదిక ఎక్కబోతుంటే, ఒక వ్యవసాయ కూలీ దగ్గరకు వచ్చి "అయ్యా! మీరు కాంగ్రెస్ పార్టీలో చేరారా?" అని దీనంగా

అడిగాడు. "కథ విన్నాక అడగరా నీకే తెలుస్తుంది" అని నాజర్ చెప్పాడు. మరోరోజు కాంగ్రెస్ జెండాతో ఒక పెద్ద కారు నాజర్ ఇంటి ముందుకు వచ్చి ఆగి వున్నది. నాజర్ తల్లి దాన్ని చూచి "ఒరే నాయనా! అడుక్కు తిని విద్య నేర్చుకున్నావు. జైలుకెళ్ళి లాఠీ దెబ్బలు తిన్నావు. నాజర్ ఒక అబ్బకు ఒక అమ్మకు పుట్టినవాడని జనం అనుకొంటున్నారురా! కాంగ్రెస్ సభకు పోయేముందు మరోసారి ఆలోచించుకో" అన్నది. అప్పుడు నాజర్ 'నేను రావడంలే'దని కారును వెనక్కు పంపాడు.

డాక్టర్ రాజారావు మద్రాసులో పుట్టిల్లు సినిమా తీస్తూ అందులో బుర్రకథ చెప్పాలని నాజర్‌ను మద్రాసుకు పిలిపించాడు. దానితో సినిమా రంగంలో కూడా మంచి అవకాశాలు వచ్చాయి. నాజర్ అక్కడ కూడా ప్రకాశించాడు.

రాష్ట్రవ్యాపితంగా వేలాది కథలు చెప్పి లక్షలాది ప్రేక్షకులను తన బుర్రకథ గానంతో ఉర్రూతలు ఊగించాడు నాజర్. ఎన్నో సన్మానాలు ... ఎన్నో సత్కారాలు ... ప్రముఖుల ప్రశంసలు... ప్రభుత్వం పద్మశ్రీతో సత్కారం చేసింది.

అట్టడుగున జన్మించిన నాజర్ "బుర్రకథ సామ్రాట్"గా ఇంత ఉన్నతస్థితికి ఎలా రాగలిగాడు? అది తెలియాలంటే "పింజారి" పుస్తకం చదివి తీరాల్సిందే. ప్రతి కళాకారుడు, కళాకారుడు కావాలనుకొనే ప్రతివాడు చదవవలసిన పుస్తకం "పింజారి". నాజరు, ఆయన కుటుంబ సభ్యులూ చెప్పిన విషయాలను అక్షరీకరించిన డా॥అంగడాల వెంకట రమణమూర్తిగారు అభినందనీయులు. సరళమైన, సహజమైన భాష, చక్కని వాక్యాలు, పఠితులను పుస్తకం ఆసాంతం చదివించే తీరు... మరింత అభినందనీయం.

**నల్లూరి వెంకటేశ్వర్లు**

గౌరవ అధ్యక్షులు, ప్రజానాట్యమండలి

# నా మాట :

**ఆ** రోజూ నా రాత బాగలేక –

"ఏ రాగాలు యెక్కువగా అంటారు మీ కథలో" అని అడిగాను నాజరుగారిని.

ఆయన నవ్వు బిగపట్టుకుని – "నీకేం తెలుసో చెప్పు నాకేం తెలుసో చెప్తా" అన్నారు.

నేను చేతులు కట్టుకుని కళ్ళు మూసుకుని – "తోడి, శ్యామ, భీంప్లాస్, ముఖారి, మాల్కాస్, ఆనందభైరవి, కానడ, శ్రీ, తిలకా మోదు, మోహన, శివరంజని, కాఫీ, షణ్ముఖప్రియ, ఉదయరవిచంద్రిక, కేదారగౌళ, భైరవి, సింహేంద్ర మధ్యమ, కళ్యాణి, గూడూరు సావిత్రిగారు... హరిశ్చంద్ర అడివి సీను, బాలనాగమ్మ... బాలవర్ధి త్రూ అవుట్, గయోపాఖ్యానం... అర్జునుడు వార్‌సీన్, చింతామణి... భవాని త్రూ అవుట్ ఆడతానండీ" అన్నాను ఆపకుండా.

ఆయన గట్టిగా నవ్వేశారు.

"ఎందుకయ్యా ఆ వణుకు! మధ్యలో ఆ గూడూరు సావిత్రి ఏమిటి?" అన్నారు.

"ఆమె పక్కన నేను హరిశ్చంద్రుడు ఆడానండీ అది మీకు ఎట్లయినా చెప్పాలని నా తాపత్రయం. ఆమె రాగాల మధ్యలో వచ్చేసింది" అన్నాను కొంచెం భయం తగ్గి.

అయినా మా అరుణక్క అంటే నాకు భయమే. ఆరేళ్ళ పాటు ఆమెతో దాగుడుమూతలాడుతూ నాజరుగారిమీద డాక్టరేటు చేసి అప్పుడు ఆ బైండు పుస్తకం ఆమె ముందు పెట్టాను. ఆమె ఆ దిండును తిరగేసి – "సవటా! ఇందులో ఆత్మ ఏదిరా" అంది.

"ఆత్మ గూడా వుందక్కా" అని కొన్ని చిత్తుకాయితాలు పట్టుకొచ్చి చూపిచ్చా. అవి ఆ ఆరేళ్ళ కాలంలో అడపా దడపా నాజరు గారు చెబుతుంటే నేను రాసుకున్న ఆయన ఆత్మకథ.

అవి చూసి "– సగమేరాశావు. ఇంకో సగమేదిరా" అంది మళ్ళీ.

ఇంకో సగమేమిటో నాకు అర్థం కాలేదు. అప్పటికీ నాజరు గారు చనిపోయారు. తర్వాత బోధపడింది. అప్పుడు వెళ్ళి ఆ సగం రాసుకొచ్చాను. ఆ సగం ఆదంబీ గారే. అప్పట్లో నేను ఎక్కువసేపు నాజరు గారితో మాట్లాడితే ఆయన ఆరోగ్యం బావుండదని ఆమె కోప్పడేవారు. అంతే తెలుసు నాకప్పుడు. నేను పారిపోయివచ్చేవాడిని. నేను ఎప్పుడు వెళ్ళినా ఆయన అడిగే తొలిమాట

– “అన్నం తిన్నావా అయ్యా” అని. ఆయన పోయిన తరవాత కూడా నాకు ఆ ఇంట్లో అదే మాట – “అన్నం తిన్నావా అయ్యా” అని వినిపించింది. ఈ సారి ఆ మాట ఆదంబీ గారిది. నా కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. నాజరుగారనేవారు “నాకు యింకా నీతో మాట్లాడాలనే వుందిగానీ ఇల్లాలు వూరుకోదయ్యా” అని. కానీ ఇప్పుడు ఆ ఇల్లాలు ఫులుస్టాప్ లేకుండా ఆయన గురించి మాట్లాడుతూనే వుంది. నాటుకోడి కోయించి అప్పటికప్పుడు యింత నూని, కొత్తిమీర తెప్పించి చాపేసి పెద కంచం నిండా అన్నం మొదలూ మారూ ఒకేసారి పెట్టింది. తిన్నంత కూర.

“నాయనా ఆ బ్రాయిలరు కోణ్ణి పొరపాట్న ఎప్పుడైనా వండామా చట్టి గిరాటేసేవాడు. గుడ్డు అయినా సరే నాటుదే వుండాలి” అని మొదలు పెట్టింది.

ఆమె చెప్పిందంతా జోడిస్తే తప్ప మా అక్క సంతృప్తి పడలేదు. అదంతా కలిపి యీ పుస్తకం అయింది. దీంట్లో నా సొంత మాట ఒక్కటి కూడా లేదు.

కానీ నాజరు గారిపై నేను చేసిన పిహెచ్.డి., అంటే నాకు ప్రాణం. నేను నాగార్జునా యూనివర్సిటీ విద్యార్థిని. మా గైడ్ ఎస్. గంగప్పగారు నన్ను ‘బుర్రకథ పితామహ పద్మశ్రీ షేక్ నాజరు’గారిపై రీసెర్చి చేయమన్నప్పుడు అంత గొప్ప వ్యక్తి మీద రీసెర్చ్ చెయ్యడమంటే నా వల్ల గాదనిపించింది. మా గంగప్పగారు “దిగరా లోతు అదే తెలుస్తుంది” అన్నారు. వూటబావిని చేదగలమా! నాజరుగారితో మాట్లాడితే కూడా అంతే అని దిగిన తరవాత గాని తెలుసుకోలేకపోయాను. పద్మశ్రీ అని భయపడ్డాను. కానీ ఆయనకి ఆ విషయం గుర్తులేదు. నా ఆరేళ్ళ పరిచయంలో ఆయన దాని వూసే ఎత్తలేదు. ఆత్మకథగా చెప్పేప్పుడు మాత్రం ఒక ఇన్ఫర్మేషన్ గానే చెప్పారు. ‘గండపెండేరాలూ, సన్మానాలూ, వూరేగింపులూ ఇవన్నీ జనం వేసే ఒక ఈలకు సాటిగాదు’ అనేవారు.

మా ఇంట్లో పెద్దవాళ్ళంతా, నాజరు బుర్రకథ విన్నవాళ్ళే. వాళ్ళంతా నాజరు గారి అభిమానులే. నేను ఆయన గురించి రాస్తున్నాను అని చెపితే అందరూ నవ్వారు. వీడికేదో నాలుగు రాగాలొచ్చని నాజరు గురించి రాస్తాడంట అని కూడా అనుకునేవుంటారు. కానీ నాజరు గారు వారి కుటుంబంలో వారు అందరూ నన్ను తమవాడిగా చూశారు. ముఖ్యంగా ఆయన కుమారుడు బాబూజీగారు. ఫీల్డు వర్క్ చేయడానికి నా ప్రియశిష్యుడు పి. భాస్కర్ చాల సహాయం చేశాడు. నా థీసిస్‌ని నా బ్రహ్మరాతలోంచి చక్కగా ఫెయిర్ చేసి పెట్టాడు మా తమ్ముడు సుధాకర్. మా అక్క సంపాదకత్వం వహించింది. ఇది పింజారీ మీద గొల్లని సాహిత్య విద్య. ఆశీర్వదించండి.

**అంగడాల వెంకట రమణమూర్తి**

# పింజారి

శ్రీమంతులకు, సేద్యవంతులకు, చేతివృత్తుల జనాలకు, సిరులు చెరిగే పంట పొలాలకు, అభయం ఇస్తూ ఊరికి పడమర హద్దున కొండకింద పొన్నకాయంత కళ్ళున్న తల్లి జడలమ్మగుడీ, గుడికి ఈశాన్యాన ఊరందరికీ ప్రాణాధారమైన మంచినీళ్ళ బావీ, బావి కనుచూపులో ఊరి మధ్యన, ఒకనాటి జమీందారు వాసిరెడ్డి వెంకటాద్రి నాయుడు ప్రతిష్ఠించిన నూటొక్క శివలింగాల ఆలయము, ఆలయం చుట్టూ అష్టకష్టాల అష్ట అయిశ్వర్యాల అష్టవర్ణాలూ అలరారు ఈ ఊరు గుంటూరు ఉత్తరదిశ నున్న 'పొన్నెకల్లు'.

పొన్నెకల్లు తూర్పువీధి దూదేకు సాయిబుల పందిరిగుంజ కూడా పాట పాడుతుందని పేరు. నేను ఆ పందిరి కిందే పుట్టాను. ఎప్పుడంటే సిద్ధాద్రి నామసంవత్సరం 1920 ఫిబ్రవరి 5వ తేదీ గురువారం రాత్రి 8 గంటలకు మఖ నక్షత్రాన పుట్టాను. మా అమ్మ పేరు బీబాబీ. మా నాన్న షేక్ మస్తాన్, చెక్కభజనలో నేర్పరి. నౌబత్ మేళగాడు. మా నాన్నకు అన్న షేక్‌నాజర్ పెద్ద షహనాయి విద్వాంసుడు. ఆయన పేరే నాకు పెట్టారు. మా పెద్దనాన్న చనిపోవడం నేను మా అమ్మ కడుపున పడ్డం ఒకే నెలలో జరిగాయట. మా అన్న మళ్ళీ నాకు పుట్టబోతున్నాడని అందరికీ చెప్పుకునేవాడట మానాన్న. కానీ నేను పుట్టగానే అబ్దుల్ అజీజ్ అని పిలిచాడంట మా గారపాడు తాత. ఆయన మా అమ్మకు నాన్న. ఆయన ఆయుర్వేద వైద్యుడు భూతవైద్యం కూడా చేస్తాడు. మంత్రవేత్త అనిపేరు. ఆయన మంచి నిష్టపరుడనీ ఆయన కంచం చెంబు, మంచం బట్టలు ఎవరూ తాకరనీ యెంతో నీమం కలవాడనీ నా ఉయ్యాల మంచానికి తనపైపంచె షామీనా కట్టేవాడనీ యెవ్వరినీ తాకనిచ్చేవాడు కాదనీ అమ్మ చెప్పింది. మా నాన్నకు అబ్దుల్ అజీజ్ పేరు నచ్చలేదు. నాజరు అని పిలవాలని ఆయన ఆశ. “మీ అన్న యెంత గొప్పవాడైనా మఖలో పుట్టి పుబ్బలోపోయాడు. అర్ధాయుష్కుడు. ఆ పేరు వద్దు” అన్నాడట తాత.

"కాకిలా కలకాలం దేనికి మామా. మగబిడ్డగా పుట్టి మగబిడ్డగా గిట్టాడన్న పేరుతప్ప. పుత్రోత్సాహము తండ్రికి పుత్రుడు జన్మించినపుడె పుట్టదు" అన్నాడట నాన్న.

"ఆపు. ఆపరా నీ పద్యాలు. వాడెంత మొనగాడైనా కీర్తిమంతుడయినా అర్థాయుస్సు సన్నాసే" అని కోప్పడి ఆ పేరు పెట్టనంటే పెట్టనన్నాడంట మా తాత.

వాళ్ళలా వాదులాడుకుంటుంటే నేను మాత్రం పురిటి మంచంలోనే మూడు రోజులు పాలు ముట్టక వొకటే పోరు చేశానంట. అప్పుడు మా పెద్దమ్మ ఫాతిమాబీ అంటే మా అమ్మకి అక్క, ఈమెను కూడా పొన్నెకల్లు లోనే ఇచ్చారు. ఆమె అత్తగారి వూరు కూడా మా వూరు పొన్నెకల్లే. ఆ మా పెద్దమ్మ, ఇల్లు అలికి తలస్నానం చేసి సాంబ్రాణి పొగవేసి "నాజరయ్యా నా బిడ్డ పాలు తాగి ఆడుకుంటే నీ పేరునే పిలుస్తామయ్యా" అని మొక్కుకుందట. ఆ క్షణానే నేను మా అమ్మ పాలు తాగి ఆడుకున్నానట.

ఇది మా అమ్మలిద్దరూ కలిసి చెప్పిన పురిటి మంచం నాటి పిట్టకథ. నిన్నమొన్నటి వరకూ గారపాడు మామలూ అత్తలూ బావలూ నన్ను 'అబ్దుల్ అజీజ్' అనీ – పొన్నెకల్లు పెద్దనాన్నలూ చిన్నాన్నలూ అమ్మలూ అక్కలూ 'నాజరు' అనీ పిలుస్తూ వొచ్చారు. నేను తప్పటడుగులు వేస్తూనే వొచ్చీరాని మాటలతో.

"హ అదిగో లేడీ
పరిగెడుతోందీ
లేడి బోయెరా
హ బాణమేయరా!!" అని పాడుతూ ఎగిరి గంతులేస్తున్నానట
గేదె, దున్న తోక వెంట్రుకలు పీక్కొచ్చి గడ్డాలూ మీసాలూ బొట్లు పెట్టి
"నేనే బ్రహ్మనురా
పామరులారా
ఓ జనులారా
నేనే బ్రహ్మనురా!!" అని తీగె రాగాలు తీస్తున్నానట.

అమ్మ నాన్న ఆరుగాలం ఎండనకా వాననకా అలుపూ సొలుపై లేకుండా అరవచాకిరి చేసినా ఆకళ్ళు తీరని అగచాట్ల మారి కుటుంబంలో పుట్టాను. పై పంచె కొంగున ఇన్ని తెల్లజొన్నలో తాలూ తరకా సజ్జలో మూటగట్టుకుని మిట్టమధ్యాహ్నానికి నాన్న కొంపజేరటం, నన్ను కన్నమ్మ పెంచినమ్మలు ఆ చారెడు గింజలు దంచి వండి నాకూ నా చెల్లికీ పెట్టడం మళ్ళీ అంతా పనులకు పోవటం దినచర్యగా జరుగుతున్నది. మా పెంచినమ్మ అంటే మా అమ్మకు యింకో అక్క అన్నమాట. ఆమె పేరు లాలూబీ. ఈమెను కూడా మా తాత కోడరికం పొన్నెకల్లే పంపాడు. కానీ ఆమె వితంతువు. పిల్లలులేరు. అందుకని తన

రెక్కల కష్టంతో తాను బతుకుతూ మా అమ్మకి సాయంగా వుండేది. మేమంటే ఆమెకు చాల ఇష్టం. మమ్మల్ని బాగా చూసుకునేది. అందుకని ఆమెను పెంచినమ్మ అనడం మాకు అలవాటు. అసలు మా గారపాడు తాతకి ఎనిమిది మంది సంతానం. అందులో అయిదుగురు అమ్మాయిలు, ముగ్గురు అబ్బాయిలు. ఆ అక్కచెల్లెళ్ళలో మా అమ్మ మూడో అమ్మాయి.

ఎలాగో శ్రమపడి కొత్త లాగూ కొత్త చొక్కా కుట్టించాడు నాన్న. చదువు మూడోనేత్రమనీ కొబ్బరికాయా ఆకులూ వక్కలూ పావలా గురుదక్షిణా గురువుగారికిచ్చి వప్పగించాడు వీధిబడిలో నన్ను. రెండో తరగతి చదువుతున్నాను.

బళ్ళో బజార్లో పాటలూ పద్యాలూ కూనిరాగాలు తీయడం విన్న పంతులుగారు పలకమీద సాయంత్రం ఎక్కాలుతో పాటుగా సుమతీ, దాశరథీ, భాస్కర శతకాల పద్యాలు రాసి ఉదయం అప్పచెప్పిచ్చుకుంటున్నారు. మామూలుగా మధ్యాహ్నం బడి నుంచి ఇంటికెళ్ళగానే

“గింజలు తీసుకుని యింకా మీ నాన్న యింటికి రాలేదు నాయనా. యింకా వండలేదు. మధ్యాహ్నం పంతులుగార్ని అడిగి పెందలకడరా అయ్యా” అని అమ్మ పాలో పెరుగో చల్లో తాగడానికి యిచ్చేది. నేను మూతి తుడుచుకుని

“సజ్జ జొన్నలు లేవు గానీ చల్ల తాగీ చదువుకోరా” అని పాడుకుంటూ పోయేవాణ్ణి

నేను బడికి వెళ్ళేప్పుడూ రాగయుక్తంగా ఆ పద్యాలు చిన్నగా ప్రాక్టీసు పెట్టటం వింటున్న వీధిలో చిల్లర దుకాణాల వాళ్ళు మధ్యలో నన్ను నిలవేసి పద్యాలూ పాటలూ పాడించి జేబునిండా శనగపప్పు, బెల్లం గడ్డలు కుక్కి పంపేవాళ్ళు. నేను యింటికెళ్ళి నా సంపాదన మా అమ్మలకు చూపించేవాణ్ణి.

ఒక్కోరోజు కుండడుగు మాడు నాకు చెల్లికి పెట్టి రాత్రుళ్ళు మజ్జిగ తాగి పడుకునే వాళ్ళు అమ్మా నాన్నలు.

ఒంటి మీద మరుగుకి బండమీద ఉతుక్కి కాక మారు చీర కూడా లేని మేము పక్కకు చిన్న చింకి పాతకూడా లేకుండా నిరుపేద జీవితం గడుపుతూ వుండేవాళ్ళం. అప్పుడు పెద్ద రంగస్థలం గాయకుడు కపిలవాయి రామనాథశాస్త్రిగారి రికార్డులు వచ్చాయి.

‘స్థిరమైన నడవడి
జనులందరకు వలయు’

అనే సీసపద్యం, ‘కోరి భజింతు గోవిందు నామది’ అనే కీర్తన కచేరి చావడి దగ్గర పొద్దున పూట పాడుతున్నాను. జనం తిరునాళ్ళలో మాదిరిగా నా చుట్టూ మూగివున్నారు. యింతలో నాన్న గుడిలో మేళం వాయించడానికి వచ్చాడు.

అక్కడున్న పెద్దలు– "మస్తానూ, నీ కొడుకుని బాగా చదివించి సన్నాయ్ నేర్పించవోయ్. మీ అన్న నాజర్ సాయిబు పేరు నిలబెడతాడు" అని అన్నారు.

ప్రతియేడు పీర్ల పండుగకు మా నాన్నలు అందరూ కలసి జాతీయ జానపద కళారూపాలైన పులి, ఎలుగు వేషాలు, గొర్లకాపరి, ఎరుకలసింగి, సింగడు యిత్యాది పగటి వేషాలు వేస్తూ పండగ గింజలు, డబ్బా, అడుక్కోవడం ఆనవాయితీ. ఆ యేడు నాన్న ధగధగమెరిసే డాగురేకులతో నానెత్తికి కిరీటం, భుజకీర్తులు తయారుచేశాడు. పద్యాలు, పాటలు, వీధిభాగవతాలు ప్రారంభించాం. చాలా ఎక్కువ గింజలు, బట్టలు, డబ్బులు దొరికాయి.

వీధిభాగవతులు అందె కోటదాసు, జంగా సుబ్బారావు, యాదవదాసు, చిన్న సుబ్బన్న, చింతపూవు మాణిక్యమ్మ, తారాబాయి, పద్మాబాయి, వీళ్ళ నాటకాలంటే చెవికోసుకునేవాణ్ణి. పెద్దలతో కలిసి నాలుగైదు మైళ్ళు నడిచి వెళ్ళి కోటదాసు పాటలు పాడేవాణ్ణి.

ఆయన రాగాలంటే ఆ పాటలంటే ఎంతోయిష్టంగా వినేవాణ్ణి. యిప్పటికీ కోటదాసు పాడిన 'చూపరే బ్రాహ్మణ సుందారవతులార' అనేపాట, 'ఎంత మాటడిగితివమ్మా' అనే పాటలు మరుపురాలేదు. పాటలన్నా, రాగసాయలన్నా ఆ నాడు వొక్క దఫా వింటే చాలు గుర్తుండేవి. పట్టేసి పాడేవాణ్ణి. కానీ ఎక్కాలు, లెక్కలు మాత్రం ఎంత చదివినా చచ్చినా గుర్తుండేవికావు.

వాటి గురించి గురువు చేత రూళ్ళ కర్రదెబ్బలు వేళ్ళు, మణికట్లు విరిగేట్టు తినేవాణ్ణి.

స్కూలు వార్షికోత్సవం వచ్చింది. 'ద్రోణవిజయం' అనే చిన్న నాటిక ఆడాము. నేను ద్రోణాచార్యులుగా పద్యాలు, పాటలు పాడాను, యాక్షన్ చేశాను. వీధిభాగవతాలు చూచి కొంత నేర్చానుకదా, పరీక్ష పంతులు నావీపు తడుతూ మాబాగా చదువుకోరా మంచిగాయకుడవూ, యాక్టరువూ అవుతావని అయిదు రూపాయలు, పుస్తకం, పెన్సిలు బహుమతిచ్చారు. ఇంటికి రాగానే పెంచినమ్మ మిరపకాయలూ, చూరు పుల్లలూ, వెంట్రుకలతో దిష్టితీసి పొయ్యిలో వేసింది. తూ.తూ. అని పొయ్యిలో వూసింది. 'పాటల్లో, పద్యాల్లో పంతుళ్ళు, పెద్దల, ప్రజల మన్ననలనూ దీవెనలనూ పొందుతూ, లెక్కల్లో, ఎక్కాల్లో తన్నులు తింటూ నాలుగోక్లాసు పాసై అయిదులో చేరాను. నాన్న మా పెద్దన్నకు దగ్గర స్వరాలు మొదలు పెట్టించాడు. గుడి మేళాని కవసరమని శ్రుతిపోయటం అలవాటు చేయిస్తున్నారు.

గోగుపుల్ల గొట్టంతో నీళ్ళ చెంబులో వూదడం గుక్కతిరిగేందుకు ఆగక ఆ శబ్దం మోగేందుకు బాగా పరుగెత్తిస్తూ ఆ రొప్పు ఆగకుండా వూదిస్తూ శ్రుతి గుక్క నేర్పిస్తున్నారు.

చిన్న భూస్వామి శ్యామలరెడ్డి గారు ప్రొద్దుటే మాయింటి కొచ్చి "మస్తానూ ఈ పోర్షన్ నాజరు చేత చదివించు శ్రీరామనవమి రోజున పెద్దగుడి దగ్గిర 'కనకతార' నాటకంవేద్దాము" అని పోర్షన్ ఇచ్చి వెళ్ళాడు. హార్మోనిస్టు ఖాదర్ సాహెబ్ గారిని తెనాలి నుండి పిలిపించారు రెడ్డిగారు. నాలుగు నెలలు రిహార్సల్స్ చేశాం. రామిరెడ్డిగారి దొడ్లోనే హాలు గట్టి, డ్రస్సులు, మేకప్పులు, తెరలు, పెద్దహంగామాతో టిక్కెట్లు బెట్టి ఆడాము. నేను కనకసేనుడు, రహంతుల్లా (మా బంధువు) తార, మా అన్నయ్య కమల, మా పెద్దబావమరిది క్రూరసేనుడు. నాటకం అద్భుతంగా వచ్చింది.

చుట్టుపక్కల గ్రామాల్లో కూడా ఆడాము. నాకు మంచి పేరు వచ్చింది. మా పెద్దమ్మ రోజూ దిష్టితీస్తున్నది.

హార్మోనిస్టు ఖాదర్ వొకరోజు మా యింటికొచ్చి మస్తాన్‌గారూ మన కుర్రాడు మంచి తెలివి కలవాడు. శ్రుతి, లయ, గానం, మంచి కంఠం కలవాడు. నాతో పంపండి చదువు సంగీతం నేర్పించి గొప్పవాణ్ణి చేస్తానన్నాడు. అనగానే మా అమ్మలు గయ్‌మని కాట్లకుక్కల్లా వొక్కగానొక్క మగబిడ్డని కళ్ళముందు లేకుండా చేస్తావా చాల్‌చాల్లే పో పోవయ్యా అన్నారు.

ఛీ ఛీ నోళ్ళుముయ్యండి గయ్యాళి ముండల్లారా అని గదమాయించి 'పుత్రోత్సాహము తండ్రికి పుత్రుడు జన్మించినపుడే పుట్టదు' అని పద్యం చదివి నోరెత్తారంటే తంతానన్నాడు నాన్న. ఖాదర్‌గారితో నన్ను పంపాడు.

టి. రామకృష్ణ శాస్త్రి గారి తండ్రి టి.ఆర్.దాసుగారు తెనాలి ప్రక్క పెద్దరావూరులో యేర్పాటు చేసిన 'బాలరత్నసభ' అనే నాటక కంపెనీలో చేర్చారు నన్ను. ఖాదర్‌గారు, దాసుగారు కంటికి రెప్పలా చూస్తున్నారు. రామదాసు, తులాభారం, శ్రీకృష్ణలీల, రాధాకృష్ణ నాటకాలలో ఆడవేషాలు నేర్పుతున్నారు శాస్త్రిగారు. నాతోపాటున్న కంపెనీ పిల్లలకు చదువుట, వ్రాయుట, సంగీతం రోజూ నేర్పుతున్నారు. భోజనం, ఉదయం, సాయంత్రం టిఫిన్లూ అన్నీ బానేవుండేవి. అంతా 12, 15 సంవత్సరాల లోపు పిల్లలము.

ఏడ్వడం, నవ్వడం, కోపంగా మాట్లాడడం, చూడడం, కులకటం, మూతి ముడవడం, త్రిప్పటం, కళ్ళురమటం లాంటివన్నీ నేర్పుతున్నారు. కళ్ళల్లో కొబ్బరి నూనెవేసి, లైటువంకచూపి నీరుకారుతుంటే ఏడుపు డైలాగులు చెప్పించే వారు. పద్యాలు, పాటలు ఏడుస్తూ పాడడం, కోపంగా పాడటం 'రామదాసు' నాటకంలో 'చాందిని' వేషానికి అవసరమని తెనాలిలో నాయకురాలైయున్న కళావంతుల మేళగత్తె వద్ద డాన్సు నేర్పించారు. చిన్ననాటి నుంచి చెక్కభజన, కుల్కుకోలాటం, వీధిభాగవతం, అడుగులు తెలిసున్న కారణంగా నాకు డాన్సు చాలా తొందరగానే నేర్పగలిగిందామె. "వీడు భలే 'లయబ్రహ్మ' దాసుగారూ" అనేది. దాసుగారు నాకు బాలకృష్ణ తరంగాలు, అధ్యాత్మ రామాయణం

కీర్తనలు నేర్పుతున్నారు. తన పక్కలో పడుకోబెట్టుకునేవారు. ఆయన నా పేరు 'గోపి'గా మార్చారు. తెనాలి, విజయవాడ, రాజమండ్రి, నెల్లూరు, కావలి, గూడూరు ప్రతి పట్టణంలోనూ రోజూ, రోజు మార్చిరోజు విజయవంతంగా నాటకాలు ఆడుతున్నాం.

'రేలకాయల్లాగ ఆ పొట్టోడు, పళ్ళోడు యేం పాడుతున్నార్రా అబ్బబ్బా' అని, పొట్టోడు అంటే మామామ కొడుకు, పళ్ళోడు అంటే నేను అని జనాలు అనేవారు. మొదటి సంవత్సరంలోనే మంచిపేరు తెచ్చుకున్నాము. వెండి కప్పులూ, బంగారు మెడల్స్ వచ్చాయి.

ఇప్పుడు మాకు పొట్టి లాగూలు, అరచేతుల చొక్కాలు, బోడిగుళ్ళుపోయి బారులాగూలు, లాల్చీలు, చిన్నచిన్న క్రాఫు, పక్కపాపిళ్ళు లోకి వచ్చాము. రేపల్లె నాటకం రోజు నాన్న వచ్చాడు. నాటకం చూస్తున్న ఎవరో కుర్రవాడు ఏం పాడుతున్నాడు 'కంచు కంఠం'రా కానీ పళ్ళు కొంచెం పొడుగ్గా కన్పిస్తున్నాయిరా అని పక్కాయనతో అనడం విన్న నాన్న నిద్రలేవగానే టిఫిన్లు కాగానే రేపల్లె వూరి బయట తాటితోపు లోకి తీసుకొచ్చి వొళ్ళో పడుకోబెట్టుకోని తన చెకుముకి ఆకురాయి బిళ్ళతో ముందరి మూడుపళ్ళను అరగరుద్దాడు. ఆయన జేబులో చెకుముకి రాయి, ఆకురాయిబిళ్ళ నిప్పురాజే జమ్ముదూదీ వుండేవి. యెప్పుడు కావాలంటే అప్పుడు నిప్పు రాజేసేవాడు. చీరాల్లో మహాగొప్పగా 'కృష్ణలీల' ఆడాము. నాటకం అయిన దగ్గర నుండీ తెల్లవార్లూ నాటక కంపెనీ ఆర్గనైజర్లు, మేనేజర్లు తగువుపడుతూనే వున్నారు. తెల్లవారగానే పిల్లలకు టిఫిన్లు కాగానే డబ్బులిచ్చి యెవరి వూళ్ళకి వాళ్ళని పొమ్మన్నారు.

ఖాదర్ సాహెబ్ గారు నర్సరావుపేట తీసుకెళ్ళారు. ఇల్లు, ఇల్లాలు లేని ఏకోనారాయణ భగవాన్ అన్నట్లున్నదాయన స్థితి. ఖాదర్ గారి తమ్ముడు యేదో గవర్నమెంటు వుద్యోగి. భార్య కొంచెం మాటకారి యేదో భర్తతో బాసలో చెప్పి విసుక్కుంది. ఖాదర్‌గారు మళ్ళీ వెంటనే మురుగుళ్ళ సీతారామయ్య గారింటికి తీసుకెళ్ళి పద్యాలు పాడించి మీ శిష్యుడిని చేసుకొని సంగీతం నేర్పండి మా తమ్ముడు అన్నం పెడతాడన్నారు. అలా పదిరోజులే జరిగింది. శ్రీమురుగుళ్ళ సీతారామయ్యగారు దక్షిణాది తంజావూరు ప్రాంతంలో శిక్షణ పొందిన మంచి గాయకులు, సన్నాయి విద్వాంసులు. నాకు మంచిరోజున 'సరిగమపదనిస' సరళీస్వరాలు శృతిపక్వంగా స్వరస్థానములలో అనిపిస్తున్నారు. కానీ నాకు తిండికి తిప్పలొచ్చింది.

గురువుగారు ప్లీడర్ల, ఆఫీసర్ల, పెద్దవ్యాపారస్థుల యిళ్ళల్లో తనకు పలుకుబడి, పరపతీ వున్న చోటల్లా విచారించారు నాకు వారాలు కుదర్చాలని. "పింజారోడికి వారాలా? మేం పెట్టం" అన్నారు. ఇంక లాభం లేక నాన్నకు వుత్తరం రాశారు. నాన్న పరుగెత్తుకొచ్చాడు.

మస్తాన్, ఖాదర్ గారు యేమయ్యారో అంతు, పొంతు లేదు. వారి తమ్ముడు ట్రాన్స్‌ఫర్ మీద విజయవాడ వెళ్ళారు.

"మీరు నెలనెలా మూడురూపాయలు పంపండి వాడి తిండి నేనే యేర్పాటు చేస్తాను" అనగానే పైపంచ కొంగునున్న మూడు రూపాయలు యిచ్చి గురువుగారికి దండం బెట్టి యింటికెళ్ళాడు నాన్న. ఆ రోజుల్లో రూపాయికి ఆరుశేర్లు బియ్యం అది 1930-31 సంవత్సరం. రోజూ గురువుగారి పంచలో అన్నం వండుకోవడం వీధికోమట్ల వద్ద కాణికో, అర్థకాణికో పప్పు, కూరలు, పెరుగు కొనుక్కోవడం. పెద్ద వీధి వెనుక సారాయి కొట్ల ముందు అర్ధణా యిస్తే వొక మనిషికి సరిపడ తలకాయ మాంసం అమ్మేవాళ్ళు. వారంవారం తెచ్చుకున్నాను. కాని యీ తిండి మూడు నెలలు మాత్రమే సాగింది. వొకరోజు నాన్న వచ్చాడు. గురువుకు నమస్కారం చేసి చేతులు కట్టుకుని చిన్న మొహంతో నిలబడ్డాడు. "అయ్యా గుంటలు, చెరువులు నిండుతున్నాయి కానీ మా పాపిష్టి పొట్టలు నిండే రోజు రాలేదు" అన్నాడు.

"ఏమైంది మస్తానూ" అన్నాడు గురువు. "ఏముంది స్వామీ చేసేందుకు వ్యవసాయ పనుల్లేవు మాచేతి వృత్తులు ఏనాడో పోయె,మా తిండికే తిప్పలొచ్చి పస్తులుంటున్నామయ్యా, మూడు రూపాయలు నెలనెలా మిగల్చలేక పోతున్నాం అయ్యా ఈ బిడ్డను ఏం చేస్తారయ్యా" అని కళ్ళ నీళ్ళు బెట్టాడు నాన్న.

"సరేలేవయ్యా వాడి వ్యవహారం నేను చూసుకుంటాలే గానీ నువ్వెళ్ళు. బాధపడకు కష్టాలు మనుషులకు కాక మానులకు వస్తాయా మస్తాను" అన్నారు. తెల్లవారి పాతాలు కాగానే అంగవస్త్రం నాలుగు చెరుగులూ మునగేసి చంకన తగిలిచ్చి "వొరే గోపి నా వెంట వస్తావా?" అన్నారు గురువుగారు. గురువుగారితో బయటికెళ్ళాను. యింతలో గురువుగారి భార్య పిలిచింది.

"ఆగండి, ఆగరా గోపి అని కాస్త పప్పు, పచ్చడి, గుప్పెడు అన్నం జోలెలో వేసి నవ్వింది. "నీకు విద్య బాగా వస్తదిరా" అంది.

అమ్మవాక్కు అమృతవాక్కు అనుకున్నాను. మాగురువు, గురవమ్మగారు గొప్ప విద్వాంసులు, సహృదయులే కానీ వారికి సంతానము లేదు.

గురువుగారు ఇంటి వెనుక వీధికి తీసుకు వెళ్ళారు. అది బోగం వాళ్ళ వీధి. వీధిలో నిల్చుని 'అమ్మా' అని కేక వేశారు గురువుగారు. ఆ అరుపును నేను మరిచిపోలేదు. పేరిందేవిని అలరాజు కాటి మీద కాల్చేటప్పుడు అమ్మా అని నేను వేసే కేక అదే. నాలుగిళ్ళ నుండి నలుగురు అమ్మాయిలు వచ్చి నమస్తే గురువుగారు అని నిల్చారు. వాళ్ళను చూడగానే నాకు సిగ్గుగా అనిపించింది. "చూడమ్మా! వీడు మన దగ్గర సంగీతం నేర్చుకుంటున్నాడు.

బీద దూదేకుల కులస్తుడు. సంగీతం శ్రద్ధగా నేర్చుకుంటున్నాడు. ఎంత ప్రయత్నించినా వారాలు కుదర్లేదు" అన్నారు.

ఆ మాటకు వాళ్ళంతా గొల్లున నవ్వారు. "మనకు వారాలెవ్వరు పెడతారండీ? పెద్ద పెద్ద వాళ్ళు యిళ్ళలోకి రానిచ్చి వారాలు పెట్టడానికి మనమేమన్నా బ్రాహ్మలమా?" అన్నారు వాళ్ళు.

"మీరు పది యిళ్ళ వాళ్ళు పది పిడికెళ్ళు వాడి జోలెలో వేస్తూండండి. వాడికి విద్య నేను నేర్పుతా"నన్నారు గురువుగారు.

"సరేలే బాబాయ్ అదెంత భాగ్యం అని ఓ పాట పాడించండి" అని అడిగారు వాళ్ళు. గురువుగారు నావైపు చూశారు.

నేను వెంటనే 'శాంతమూ లేక సౌఖ్యమూ లేదూ...' అని పాడాను.

ఆ అమ్మాయి లందరూ కళావంతులు, నాయకురాండ్రు కూడాను. వీరికి మేళాం జట్టు కూడా వుంది. ఆ జట్టుకు 'నాగమణి' నాయికయే కాదు పౌరాణిక నాటకాల్లో పెద్ద స్త్రీ వేషాలు వేస్తుంది. బాగా పాడుతుంది. ఆమె మామ మంచి హార్మోనిస్టు. నాకు తిండి దిగులు తీరింది. వండుకుంటే వొక్క కూరే. యిప్పుడు ఆరు, నాలుగు కూరలు. నవకాయ పిండి వంటలన్నట్టుంది మన పని. మిగిలిన అన్నం తిని కుక్క కూడా బలిసింది. యే అడ్డంకులు లేకుండా పాఠాలు జరిగిపోతున్నాయి. ప్రతి రోజు కోడి కూతతో నిద్ర లేచి సరళాలు, జంటలు, అలంకారాలు, హెచ్చుస్థాయి స్వరాలు, ఉ, ఇ, అకారాలు క్షుణ్ణంగా పలికేట్టు శ్రుతిపక్వంగా స్వరస్థానాలు క్షుణ్ణంగా పలికిస్తూ హార్మోనియం వాయిస్తూ, హార్మోనియం లేకుండా సాధన చేస్తూ ఉన్నాను. చిన్న వర్ణాలు నవరాగమాలికలతో సహా యిరువదైదు వర్ణాలు త్రికాలాలు పాడుతున్నాను 'శంకరాభరణం' పెద్ద వర్ణం మొదలుబెట్టి 'సా నిపదసరిగమాగాసా' అనంగానే వాకిట్లో పెద్ద మామ కనిపించాడు.

పాఠం ఆపి "రా మామా రా" అన్నా. పెద్దమేనమామను గురువుకు పరిచయం చేశా. ఆ మధ్యాన్నం చెరువుగట్టు చెట్టుకింద అసలు విషయం చెప్పాడు. "అబ్బాయి నాజరూ కబీరు, అజీజు, రఘురాముడు, హిమామ్ శాస్త్రి, మనవాళ్ళంతా మీ బాలరత్న సభ పిల్లలు కలిసి 'బాలమహ్మదీయుల సభ' పేరుతో 'తులాభారం' 'కృష్ణలీల' నాటకాలాడాలని ఉత్సాహపడుతూ నిన్ను తీసుకురమ్మని పంపారు" అనగానే చప్పట్లు, ఈలలు వన్స్‌మోర్‌లు తళుక్కున మెరిశాయి.

"రిహార్సల్స్ వేస్తున్నారు. నీవు లేని లోటు చాలా కనిపిస్తున్నదన్నాడు" పెద్ద మామ. గురువుగారితో మామగారి కొడుకు పెండ్లి వారంలో వస్తానని అబద్ధం చెప్పి గారపాడు వచ్చాను. మేము శ్రద్ధగా కష్టపడి నేర్చుకుని ఆడినవే కనుక చుట్టుపట్ల టిక్కెట్లు పెట్టి

ఆడుతున్నాం. ప్రక్క గ్రామాల్లో పెద్దపేరు. 'ప్రత్తిపాడులో బంగారు మెడలిచ్చారు'. 'బాలరత్న'వలెనే 'బాలమహ్మదీయ' సభ కూడా రద్దు చేయబడింది. నేను మా పెద్దమ్మ వద్ద గారపాడులోనే వుంటున్నాను. మా నాన్న వచ్చి నన్ను తిట్టి పొన్నెకల్లు తీసుకొచ్చాడు. నేను వూరికే వుండలేక కొత్తమాను సీతారాములు వద్ద కుట్టుమిషను పని నేర్చుకున్నాను. ఒకరోజు మా నాన్న మా మిషను కొట్టుకు వచ్చి "యేమిరా వెధవ పాతపీలికలకు మాసికలేసి నన్ను లక్షాధికార్ని చేస్తావా, థూ! లంజకొడక మా అన్న పేరు నీకు పెట్టానేంటిరా!" అని ఏవేవో తిట్టి వెళ్ళాడు.

"యేంటి నాజరూ 'మింగమెతుకు లేదు మీసాలకు సంపెంగ నూనె" అని అన్నాడు సీతారాములు.

'ఆయనతో మనకెందుకులే' అన్నాన్నేను.

గారపాడు మేనమామ కొడుకుతో మా చెల్లికి పెళ్ళి కుదిరింది. అందరం గారపాడెళ్ళాం. లగ్నం వేళ పెళ్ళికొడుకు బంగారు మురుగులు పెడితేనే అనుకున్న ప్రకారం లగ్నం అని పేచీ పెడితే మా నాన్న ముసుగు తన్ని దిగులుతో మూలనపడుకున్నాడు.

నేను నా బంగారు మెడల్స్‌ను గుంటూరు మార్వాడి కొట్టులో పాతిక రూపాయల కమ్మాను. మార్వాడి పాతిక రూపాయలు ఇచ్చాడు. కానీ నేను మార్వాడి మరొకరితో బేరమాడుతుండగా చూచి ఆ కొట్టులో వున్న మరొకరితో నా డబ్బులివ్వండి అని అడిగాను. అతను డబ్బులు ఇవ్వలేదనుకుని మళ్ళీ యిరవై రూపాయలు ఇచ్చాడు. అసలు పాతిక మోసంతో ఇరవై మొత్తం నలభై అయిదు తెచ్చి మా అమ్మకిచ్చాను. తృప్తిగా పెళ్ళి జరిగింది. నా సంగీతం సగంలో ఆగింది. దున్నల బండి వ్యవసాయంతో ఇల్లు గడవదు. దినపస్తులుంటున్న మేము ఎక్కడికైనా వెళ్ళి సంగీతం నేర్చుకొనే శక్తి లేదు. అమ్మా నాన్నలతో పాటు కూలికి వెళ్ళవలసి వచ్చింది.

ముట్లూరు కోటి వీరయ్య భాగవతార్ వొక రోజు రామాయణం హరికథ చెపుతున్నారు. అప్పుడు సీతాపతి గారు ఫిడేలు వాయించేవారు. నాకు సరిగ్గా గుర్తులేదు కృతులో, జావళీలో పాడారు మంచిగాత్రం, సిసలైన సంగీత బాణి, శాస్త్రీయ సంగీతం చక్కని కంఠం నాకు బాగా నచ్చింది. కథ మధ్యలో దాసుగారు పాలో, కాఫీయో త్రాగే సమయంలో వేదిక పక్కకు మెల్లగా చేరా. ఓ రోజు హార్మోనియం లాగే ఛాన్సు దొరికింది. ఆ రోజు వూరి ప్రజలు నా చేత పాడించమని సీతాపతిని కోరుతూ 'నాజర్ పాడాలి నాజరు పాడాలి' అని అరిచారు. శాంతము లేక సౌఖ్యము లేదనే కృతిని పాడాను. కథ కాగానే దాసుగారు, సీతాపతి గారు తమతో రమ్మన్నారు. పెద్ద వర్ణాలు నేర్చుకుంటూ మాతోవుందువు గాని అన్నారు. ఓ సారి పాఠం విని వస్తున్నా. కచేరి చావిడి వద్ద ఓ బంగారు వుంగరం

దొరికింది. దాన్ని గురుదక్షిణగా సీతాపతి గారికిచ్చా. తాడికొండలో రామాయణం ముగించి, జొన్నలగడ్డలో ప్రారంభించాము. శంకరాభరణం, కాంభోజి రాగాలు వచ్చాయి.

బిక్షువు కూటిలో శనీశ్వరం అన్నట్లు వర్షాల వల్ల కథ కంతరాయం కలిగింది. ఎట్లాగో జొన్నలగడ్డలో రామాయణం సకాలంలో పూర్తి చేసి కథలు ఆపు చేసి ఎవరి వూళ్ళకు వాళ్ళం ప్రయాణమైనాం. నా గతి మళ్ళీ అధోగతైంది.

సీతాపతి గారు కళావంతులు. పెళ్ళి, ఇల్లు, లేదు. ఒక పిల్ల ఉంటే వాళ్ళక్క పెంచుతుంది. నన్ను తీసుకొచ్చి గుంటూరులో నాయకురాలైన సుభద్రమ్మ మేడగదిలో వుంచారు. నేను ప్రతి రోజు సుభద్రమ్మకు వీధి సరుకులు, కూరలు తేవడం విట, చేటీల వలె కబుర్లు మోయడం. ఆమె అన్నం, సీతాపతిగారి సంగీతం ప్రారంభమైనాయి. ఇక్కడ వైలెన్ కూడా సాధన చేస్తున్నాను. తానొకటి తలిస్తే దైవమొకటి తల్చినట్లు నాన్న పరిమిలో పొగాకు పనికి వెళ్తే కడుపు నొప్పి వచ్చిందని బాధపడుతున్నాడని వెంటనే రమ్మని అమ్మ కబురు పెట్టింది. వెంటనే పొన్నెకల్లు వచ్చాను. అప్పటికే నాన్న స్వర్గస్తుడైనాడనే కబురందింది. దున్నలబండిలో తీసుకెళుతూ వుండగానే వెళ్ళే దారిలోనే ప్రాణం పోయిందని చెప్పారు.

నాన్న మరణానంతరం గుడిమేళం కోసం సన్నాయి ఊదటం నేర్చుకున్నాను. తలపాగా చుట్టి, ముల్లుగర్ర బట్టి, బాడుగ బండి దున్నలతో బండి తోలడం నేర్చుకున్నాను. లేని రోజుల్లో అమ్మలతో కూలిపనులకు వెళుతున్నాను. బండెడు సంసారం ‘దిన దిన గండం నూరేళ్ళ ఆయుష్షు’ అన్నట్లు ఏ రోజు భత్యం ఆరోజుకే చాలీచాలని రీతిలో సంసారం లాక్కొస్తున్నాను. రాత్రిళ్ళు పని లేని రోజుల్లో సీతారాముల కొట్లో మళ్ళీ మిషను కుడుతున్నాను. రవికలు, చొక్కాలు కుడుతున్నాను కానీ కత్తిరింపులు చేతకావడంలేదు. మానాన్న చనిపోయాక పెద్దమ్మ, మా అన్నయ్య పొన్నెకల్లు వచ్చి నాచేతిలో అరక తీసుకున్నాడు. అమ్మలిద్దరూ ‘ఐఎల్‌టిడి’ పొగాకు కంపెనీకి వెళ్తున్నారు. నన్ను తాటికొండలో విశ్వబ్రాహ్మణులు ‘రాఘవయ్య’ గారి వద్ద సంగీతం నేర్చుకోటానికి అన్న పంపాడు. తాడికొండలో మేనమామ కొడుకు అబ్దుల్ అజీజ్‌తో కూడా నేర్చుకుంటున్నాను. సంగీతం అవ్వగానే బ్రాహ్మణవీధి కెళ్ళి ‘అమ్మా విద్యార్థిని’ అనగానే ఇంతింత పెట్టేవాళ్ళు. అజీజ్ అదంతా తిని నిద్రపోయేవాడు. మిగిలింది నేను తిని ప్రాక్టీసు చేసేవాడిని. జోలె తప్పనిసరి. జోలె చంకలో వున్నప్పుడు నా ఈడు జోడు అమ్మాయిలు కనిపిస్తే గుండెల్లో అదోవిధంగా వుండి తలవంచుకు పోయేవాడిని.

గురువు గారు ‘కళ్యాణి’లో పెద్ద వర్ణం ప్రారంభించి, కృతులు చెప్పాడు. కానీ గురువుగారి ఏకైక కుమారునికి జబ్బు చేసింది. భార్య ఎన్నడో స్వర్గస్థురాలైంది ఆ బిడ్డ

ప్రేమను అందుకోలేకపోయారు రాఘవయ్యగారు. బిడ్డపోవడంతో మంచంపట్టారు. నా సంగీతానికి మళ్ళీ అంతరాయం.

ఇల్లు చేరాను. అన్నయ్య వొక దున్నను, బండిని అమ్మివేశాడు. ఆయన మాతాతల భూతగ్రహం, బాలగ్రహ యంత్రాలు కట్టటం ప్రారంభించాడు. రెండో దున్నను గేదెలని దాటటానికని ఉంచారు. సంక్రాంతి పండుగ గింజలు అడుక్కునేందుకు ఆ యేడు నేను, మా అన్నయ్య (మా పెదనాన్న కుమారుడు)తో కలిసి కృష్ణా జిల్లా వెళ్ళాం. నేను శృతి, గింజల జోలె తగిలించుకున్నాను, వాడు సన్నాయి వాయిస్తున్నాడు. నేను యింటి ముందు కెళ్ళి 'బూ' అనగానే ఆ యింటి యిల్లాలు విన్నాంలేవయ్యా ఆపు నీ బూర అని చారెడు వడ్లు చాటు కొంగున వేసుకొచ్చి జోలెలో విసిరి కొట్టి వెళ్ళటం, మధ్యాహ్నం వరకు వడ్లు, మధ్యాహ్నం అన్నం కూరలు అడుక్కోవడం కాలవ కట్టన తినడం ఆయేడు చెరిమూడు బస్తాల వడ్లు పోగు చేశాము. వాటిని అక్కడే మరపట్టించి మూటలు కట్టి రైల్లో వేసుకుని బయలుదేరాము.

'భిక్షపుకూటిలో శనీశ్వరం' అన్నట్లు రైల్వే ఉద్యోగులకు కొద్ది వాటా యిచ్చి మంగళగిరిలో దిగి మూటలు నెత్తినేసుకుని ఎలాగో కొంప చేరాము.

నేను అమ్మలతో పెద్ద అన్నతో కలిసి జొన్న, సజ్జ కోతలకు, మిరప, పొగ తోటల నాట్లకు వెళుతున్నాను. కాని జొన్న, సజ్జ కోతలలో మోపులు మోసి మోసి నీళ్ళ పోతలతో నా నడుము కుర్రు అవుతున్నది. చుక్కల్లో చిరుపెళ్ళలు గీరికొని కాళ్ళు చీరికొని పోయి సాయంత్రానికి జ్వరం వచ్చినట్లు వుంటుంది. నాలుగు రోజులు ఇంట్లో వుందామంటే ఆ పనిలో మరొకడిని యిరికిస్తాడేమో మేస్త్రి. ఈ భయంతో బాధలు భరిస్తూ ఆవేదన అణచుకునేందుకు అన్నట్లు సంగీతం వాయించుకునేవాడిని. పొలం వెళ్ళేప్పుడు వచ్చేప్పుడూ స్థాయిలో పాడుతుంటే ఒరే, ఒరే ఎప్పుడూ అంత పెద్దగా అరిస్తే మెదడు చెడుతుందిరా అనే వాళ్ళు పెద్దలు.

అడ్డరోడ్డు పొగాకు కంపెనీ పని సాగింది. మా అమ్మ లిద్దరూ మేస్త్రిని బతిమాలి నన్ను ముఠాలో చేర్పించారు. నేను రోజు ఎన్ని చెక్కలు పాస్ అయినవి, ఎన్ని పెట్టెలు జాకీ కొట్టినవి, ఎన్ని బేళ్ళు లారీల కెత్తింది. లెక్క రాసుకోవటం. వారం వారం బట్వాడా ఇవ్వడం. వొకసారి బట్వాడా రోజున మేస్త్రికి నాకు చేసిన పనుల్లో తేడా వచ్చింది. ఈ తేడా ఏమిటని అడిగానని రేపటి నుంచి నీకు పని లేదని వెళ్ళ గొట్టాడు మేస్త్రి. ఇంట్లో ఇత్తడి కాగు తాకట్టు పెట్టి తెచ్చిన డబ్బులతో నేను, అమ్మ క్రిష్ణా నది దాటి బేరను పనికి గొల్లపూడి వెళ్ళాము. అంతకు ముందే వెళ్ళిన మా అన్నలు వదినలూ మాకే పని లేదని చోటివ్వలేదు. మళ్ళీ వండుకునేవి తినేవి కట్టిన గోతాన్ని నెత్తి నేసుకుని కృష్ణ వొడ్డుకు

చేరాము. మా అమ్మ ఏటికట్టపై నిలిచి కన్నీళ్ళు కారుస్తూ "వున్న వొక్క ఇత్తడికాగు కుదువ బెట్టి ఖర్చు బెట్టాము. ఉత్త చేతులతో ఇంటికెళ్ళి మనం ఎట్లా బతుకుతాం అయ్యా" అని భోరున ఏడ్చింది. "మమ్మల్ని ఏ గంగలో నెడతావు కొడకా" అన్నది.

"అమ్మా 'పుట్టించినవాడు పెట్టక మానడంటారు పెద్దలు' రాతిలో కప్పకు ఆహారం ఎట్లా వస్తుందో అలా బ్రతకలేక పోములే అమ్మా!" అంటూ రేవులో దిగి పడవలో కాలు పెట్టాను.

సరే. ఇంటికి రాగానే రెండో దున్నను అమ్మి కుట్టు మిషను కొని నల్లూరి మా లక్ష్మమ్మగారి అరుగు మీద పెట్టాను.

అభిమానంతో, పరిచయమున్న వాళ్ళంతా బట్టలిస్తున్నారు. బిర్రు, వదులు అవుతున్నాయి. జేబు వీపు మీద వేశాను. వొక్కొక్క తల్లి కుట్టిన రవిక నా ముఖానకొట్టి, జాకెట్టు ఖరీదు యివ్వమనేవాళ్ళు మా లక్ష్మమ్మ తల్లి వచ్చి, ఒసే సీతమ్మా నూలుగుడ్డ నూరేళ్ళు కడతావా ఈ సారి బాగా కుట్టరా సన్నాసి అని ఓ తిట్టు తిట్టి కుట్టుకూలి వద్దులే అని సర్ది పంపుతూ వుండేది. రాను రాను నా పనిలో నిపుణత పెరిగింది. పని కూడా పెరిగింది. డబ్బు రాబడి పెరిగింది. నాకు అనవసరపు ఖర్చు పెరిగింది. పెద్ద కాపుల అబ్బాయిలతో భుజాలపై చేతులేసుకొని వీధుల వెంట తిరగడం, రచ్చబండపై కూర్చోవడం గడియారం మార్కు సిగరెట్లు కాల్చడం పెరిగింది. పెద్దకాపులకి ఇది ఎబ్బెట్టుగా కనిపించిందట. ఎంత దేశాలు తిరిగినా కుడిచెయ్యి ఎడం చెయ్యి తేడా వుంటుంది అని 'గుద్దులాలెంకి' అనే ఆటబెట్టి నన్ను జనం మధ్యకు లాగి తలా వొక గుద్దు గుద్దారు. కళ్ళ నీళ్ళు పెట్టుకుని మిషను దగ్గరకు వచ్చాను. ఇదంతా పెద్దల గూడుపుఠాణి అని నల్లూరి వీరయ్య, గుర్రం వెంకటసుబ్బయ్య చెప్పారు. అప్పట్నుంచి ఎంత వరకు ఎవరితో వుండాలో తెలుసుకున్నాను.

అన్నయ్య వ్యవసాయం మానేసి వైద్యం యంత్రాల, మంత్రాల మీద సంపాదిస్తున్నాడు. అమ్మలు ముగ్గురు గ్రేడింగుపని, నేను మిషను సంపాదన బాగుండి స్థిమితంగా వుంటున్నాము. నాకు వీరయ్య, వెంకట సుబ్బయ్యలతో పాటు బీడీలూ, సిగరెట్లు, పేకాట ఇంట్లో డబ్బులివ్వకుండా అబద్దాలాడటం చెడులక్షణాలన్నీ అలవాటయ్యాయి. ఒకరోజు హరిజనుడైన ముసలి లింగయ్య బాగాతాగి బజారులో తూలుతూ ఎవడినో తిడుతూ తూ తూ అని ఊస్తూ 'ఎర్రా ఎర్రనిదాన్ని ఎట్లా పోనిత్తురా' అని మిటమిటలాడే మిట్ట మధ్యాహ్నం ఎండలో పడుతూ లేస్తూ పల్లెలోకి వెళ్ళు తున్నాడు. ఎంత తాగి వుంటాడురా అని నేను అనగానే వీరయ్య అడుగుదామా అంటే ఎందుకురా మనమే తాగుదాం అన్నాడు వెంకట సుబ్బయ్య.

ఆ సాయంత్రమే ఓ పెద్దసీసా సారా, బుర్రకాయనిండా కల్లు రెండు కోళ్ళు మాంసం చెవడయ్య గాడింట్లో పూర్తి చేశాము. ముగ్గురం చవడయ్య ఇంటిమూల తిరిగినాక ఏం జరిగిందో నాకు మాత్రం తెలియదు. కోడికూయగానే మెలకువ వచ్చింది. తడిసిన గుడ్డలతో వెంకటసుబ్బయ్య గారి అరుగుల మీద శవాల్లా పడున్నాం. ఇంటో మజ్జిగ చిలుకుతూ అక్క రాఘవమ్మ మాటలు విన్పించాయి. "ఒరే కోటయ్యా! అరుగుమీద ఆ ముగ్గురు వెధవల్ని లేచినోడిని లేచినట్టే కొష్టంలో మొగరాళ్ళకు కట్టరా వాళ్ళ పని చెప్తాను" అన్నది. ఆమె మాటలందరం విని ఒకళ్ళ కొకళ్ళం సైగ చేసుకున్నాం. జీతగాడు అటు మంచినీళ్ళకెళ్ళడం, ముగ్గురం మెల్లగా లేచి అరుగు దిగి ఆపకుండా పరుగు పరుగున అడ్డరోడ్డుకు వచ్చి లారీ యెక్కడం. యెక్కి గుంటూరు చేరాం. మూడు రోజులు గడిపాం. జేబులు ఖాళీ అయినాయి. ఒక్క బీడి ముగ్గురం తలా ఓదమ్ములాగే దశ కొచ్చాం. ఊళ్ళో పెద్దలు ఏరిరా అపూర్వసోదరులు అని అలాంటి పిచ్చి పనులు వాళ్ళు చేయరు కదరా అని నవ్వుకుంటున్నారని తెలిసింది.

ఒక రోజు మిషను కుడుతూ కుర్రాళ్ళందరితో కలిసి పండగల్లో దేవుళ్ళ ఉత్సవాలలో పౌరాణిక, చారిత్రక నాటకాలలో వేషాలు వేస్తున్నాము.

'పాదుక'లో కైకేయిగా 'ఖిల్జి రాజ్యపతనంలో' కమలా రాణి వేషాలు వేశాం. అలాగే మేము కుర్ర జనం మొత్తంగా ఆర్యమతం పుచ్చుకున్నాం. జంజం వేసుకున్నాం 'జీవహింస చేయరాదని' మాంసం, చేపలు తినడం మానేశాం.

'త్రిపురనేని' సాహిత్యం, కమ్యూనిస్టు రహస్య పత్రికలూ, గోర్కీ 'అమ్మ' నవల తదితర సాహిత్యం చదువుతున్నాం.

దేవుడు లేడని, వీధుల్లో చర్చలు చేస్తున్నాం. ఊళ్ళో జడలమ్మ, మారెమ్మ జాతర్లో, కొలువుల్లో నడివీధుల్లో మారెమ్మ బొమ్మని కాళ్ళతో తన్నాము. ముక్కలు ముక్కలుగా చితగ్గొట్టి దేవుడు దేవతలు అంతా మోసం, దగా అని కేకలేస్తూ ఊరంతా ఊరేగాం. మమ్మల్ని తిట్టేవాళ్ళు తిడుతున్నారు, దీవించేవాళ్ళు దీవిస్తున్నారు. మొత్తం మీద పని లేని వెధవల్లో నన్నొకణ్ణి చేశారు.

**ఒ**కరోజు జోరుగా, హుషారుగా మిషను కుడుతూ దాని మోతాదులో గొంతు కలిపి కృతులు పాడుతున్నాను.

'కొమ్మినేని బసవయ్య,' 'వల్లూరి రామయ్య' చొక్కా గుడ్డ తెచ్చి పాట సాంతం విని "ఒరేయ్ నాజరూ పోసుకోలు వెధవలతో పొద్దుపుచ్చే కంటే మా అమ్మాయిలకు హార్మోనియం, సంగీతం నేర్పరా జీతమిస్తాం కదా" అన్నారు. వెంటనే వారి వద్ద డబ్బు పుచ్చుకొని

విజయవాడ వెళ్ళి నలుగురమ్మాయిలకు నాలుగు సింగిల్ హార్మోనియంలు తెచ్చాను. సంగీతం ప్రారంభించాను. ఈనాటి సినిమా సంగీత దర్శకుడు 'చక్రవర్తి' ఆయన తల్లి, తండ్రి, అక్క నాకు శిష్యులు.

చక్రవర్తి కూడా ఆనాటి శిష్యగణంలోని వాడే. సరళాలు, జంటలు, అలంకారాలు పాడుతూ వాయించేనాటికి నాకు హార్మోనియం బాగా వాయించటం వచ్చింది. ఇంతలో దామర్లపల్లి నుండి నలుగురు కుర్రాళ్ళు మాకు సంగీతం నేర్పమని జీతం కావాల్సినంత యిస్తామన్నారు. ఇంతలో ఫణిదిం కరణంగారు తన కుమార్తెకు హార్మోనియం సంగీతం నేర్పాలని ఎట్టోణ్ణి పంపారు. ఈ రెండూళ్ళు పొన్నెకంటికి దక్షిణంగా నాలుగు మైళ్ళు దూరంగా వున్నాయి. ప్రొద్దుట పొన్నెకల్లులో పాఠాలు చెప్పుకుని భోంచేసి రాగాలు తీస్తూ దామెర్ల పల్లి చేరడం అక్కడ పాఠాలు చెప్పడం మధ్యాహ్నం టిఫిన్ చేయడం. మెల్లగా డొంకన రాగాలు పాడుతూ ఫణిదం చేరడం పాఠాలు చెప్పడం ఆ రాత్రికి భోంచేయడం, ఉదయం లేచి కాలకృత్యాలు తీర్చుకొని అమ్మాయికి పాఠాలు చెప్పడం దామెర్లపల్లి రావడం పాఠాలు పూర్తిచేసి భోజనం చేయడం కూనిరాగాలతో ఇల్లు చేరటం నిత్యకృత్యమైంది. మిషను మూలపడింది. అమ్మేశాను. నెలనెలా పిల్లల జీతాలు నాటకాలలో కిరాయి సజావుగా సాగుతుంది. అమ్మలు, అన్నయ్య నాపెండ్లి ప్రయత్నాలు ప్రారంభించారు. ఈ వార్త విన్న శిష్యులు వున్న వాళ్ళంతా వంద యాభై పోగుచేసిచ్చారు. కరణంగారు తలంబ్రాల చీర,జాకెట్లు, రెండు వందలు రూపాయలు యిచ్చారు. చిన్న సన్నాయి, బ్యాండు, నౌబతు మేళాలు, పెద్ద ఆటగుర్రం. 1942లో మేనమామ కూతురు కాశింబీతో నా వివాహం బ్రహ్మాండంగా జరిగింది. భార్య అమ్మగారి వూరు 'కోండ్రుపాడు'. అక్కడికి అరణం తినడానికి వెళ్ళా, ఆ చుట్టుపక్కల గ్రామాల్లో పెద్ద పెద్ద యాక్టర్సుతో కిరాయి నాటకాలలో వేషాలు వేస్తున్నాను. 'కోండ్రుపాటి' కుర్రజనం మాకో నాటకం చెప్పమని పట్టుబట్టారు. నెలకు 200 జీతం. కుర్రాళ్ళంతా చందాలు పోగుచేసి డబుల్ రీడ్ తొక్కుడు హార్మోనియం కొని యిచ్చారు. కనకతార నాటకం నాలుగు నెలలు కష్టపడి పాటలు రాసి సాయిలు కట్టి, పద్యాలు పాడించి నాటకం చాలా బాగుంది అనిపించాను. ఊరి పెద్దలు, ప్రజలు తెల్లవారి నాక ఆరువందలు వసూలు చేసి నాకిచ్చి రెండోవారంలో మళ్ళీ ఈ నాటకం ఆడించమన్నారు. నాటకం చూడవచ్చిన గ్రామస్థులు నాకు మూడు వందలు జీతం, ఖర్చులు యిచ్చారు. కృష్ణలీల ఆడించాను. గ్రామంలోనూ ప్రజలు, పెద్దలు ఆరువందల రూపాయిలు పోగుచేసి రెండో వారంలో అదే నాటకం ఆడించారు. ఇట్లా చినలింగాయ పాలెం, కాట్రపాడు, చుట్టుపక్కల కుర్రాళ్ళు మాకు మాకు అని ఎగబడ్డారు. నాటకాలు నేర్పటం, పెద్దల పక్క నటించటం, హార్మోనియం కిరాయికి, వాయించటం, మనపని

మూడుపూలు ఆరుకాయలుగా వుంది. శాలువాలు, సన్మానాలు మహాగొప్పగా వుంది. కాని నా భార్యకు చిన్ననాటి జబ్బు మా కలయికతో తిరగబెట్టినాయి. కళ్ళు ఎర్రగా, ఇంతింత లావుగా జ్యోతులయ్యాయి. పూర్తిగా ఎరుపు తగ్గే వరకూ చెరోచోట వుండాలని వైద్యులన్నారు. నేను ఆరాధించేది స్త్రీలని. నా విద్య ఆరాధించబడేది స్త్రీల చేత. తినేది ఇంటింటి తిండి. నాకు బ్రహ్మచర్యం ఊపిరాడని పని అయింది.

పొన్నెకల్లు నుండి జాబు (ఉత్తరం) వచ్చింది. తుళ్ళూరు గ్రామంలో పాటల పోటీలని ప్రథమ బహుమతి మనకే రావాలని రాశారు కమ్యూనిస్టు మిత్రులు. వారం పది రోజుల్లో వస్తానని ఈలోగా పోర్షన్లు చదువుతూండమని చెప్పి యాభై రూపాయలు అడ్వాన్సు పుచ్చుకుని పొన్నెకల్లు వచ్చాను. తుళ్ళూరు సభలో పాల్గొన్నాను. ప్రథమ బహుమతి వచ్చింది.

తుళ్ళూరులో సభను ఏర్పాటు చేసిన కమ్యూనిస్టు నాయకులు. కొండపనేని బలరామ్, వేములపల్లి శ్రీకృష్ణ పొన్నెకల్లు వచ్చి గ్రామ కమ్యూనిస్టు కమిటీ ఏర్పాటు చేశారు. నన్ను గుంటూరు తీసుకొచ్చారు. తుళ్ళూరు నుండి వేపూరి రామకోటిని తెనాలి నుండి ముక్కామల పురుషోత్తాన్ని తీసుకొచ్చారు. అడవిలోని ఉసిరికాయ సముద్రంలోని ఉప్పూ ఊరగాయ పచ్చడన్నట్లు మాముగ్గురిని 'బుర్రకథ' ప్రాక్టీసు చేయమన్నారు. ఆఫీసులో మాకు రూము అన్ని ఖర్చులూ భరాయించారు. రామకోటి కథ, నేను హాస్యం, పురుషోత్తం రాజకీయం – పార్టీ నిర్ణయం ప్రకారం. కథ ప్రాక్టీసు చేసి ఈమని గ్రామంలో చెప్పాము. ప్రజలు కథ బాగుందన్నారు. కానీ రామకోటికి నచ్చలేదు. అవతల, ఇవతల నావాళ్ళేగాని నడుంగులో నాయాల ఎవడో అన్నట్లుంది అని దళాన్ని రామకోటి హాస్యం, పురుషోత్తం రాజకీయం నేను కథ. మాకు ముందు కథ చెపుతున్న చింతల సూర్యనారాయణ, వెంకట సుబ్బయ్య, కాకుమాను సుబ్బారావు వీళ్ళు ముగ్గురూ సలహాలిస్తున్నారు.

శ్రీకాకుమాను సుబ్బారావు రాసిన 'టాన్యా' అనే సోవియట్ వీరవనిత కథ మొదటగా తాటికొండలో చెప్పాం. చుట్టు పట్ల అయిదారు గ్రామప్రజలను పార్టీ పోగుచేసింది. కథ బ్రహ్మాండంగా వుందని దొడ్డవరపు వెంకటస్వామి గారిని గుర్తుకు తెస్తున్నానని ఆ ప్రాంతం అంతా మోత మోగింది. రూంకు రాగానే తప్పులన్నీ తెలియపరుస్తూ, నాకు తెలిసిన పద్యాలు, ఏ రాగం, ఏ సందర్భంలో పాడితే బావుంటుందో అలాగే పాడి, పాడిస్తున్నారు.

రాగాలెట్లా మార్చాలో లోగడ నాటకానుభవం వున్న నేను త్వరగా వాటిని గ్రహించి సాధన చేసి వేదికలపై ప్రదర్శిస్తున్నాను.

పురుషోత్తం చదువుకున్నాడు. మాకు సిద్ధాంత గ్రంథాలు, రోజువారీ పత్రికలు చదివి వివరించేవాడు.

మోటూరు హనుమంతరావు వారి భార్య ఉదయం, పులుపుల శివయ్యలు సిద్ధాంత గ్రంథాలు చదివించి చెప్తున్నారు. ఆఫీసులోనే వుంటున్నాము. రాజకీయంగా తర్ఫీదు చేస్తున్నారు. సుబ్బారావు దళానికి తంబుర లేదు. కథకునికి కాళ్ళకు గజ్జెల్లేవు. అందెలున్నవి, చెక్కలున్నవి. తంబుర లేదు. 'శ్రుతి, మాతాపితలన్నారు. శ్రుతిలేని పాట, మతిలేనిమాట' అన్నారు పెద్దలు అని పార్టీ పెద్దలకు నచ్చచెప్పి శ్రుతికి తంబుర కావాలని రామకోటి పట్టుపట్టాడు. చింతల సూర్యనారాయణ రాజకీయ హాస్యగాడు. ఆనాడు రామకోటిని, నన్ను దావులూరు తీసుకెళ్ళి, దొడ్డవరపు వెంకటస్వామిగారి తొలి నాటి తంబురను నాకిప్పించారు. రామకోటి ఆ తంబురాకు తీగలనమర్చి నాగొంతుకు సరిపడిన శ్రుతినమర్చి ప్రధానమైన ధింత, ధింధింత దరువునకనుపుగా తంబురపై మీటడం నాకు నేర్పాడు. ఇంతలో తాళ్లూరులో కథ ఏర్పాటు చేశారు. అది రెంటపాళ్ళ గుడ్డిజంగం గారి ప్రాంతం. బస్సు దిగి అయిదు మైళ్ళు నడవాలి తాళ్ళూరు. దారిలో నాకు రెండు మూడు అడుగులు చూపించాడు. నేను లోగడ నాటకాల్లో, చెక్క భజనల్లో కుల్కు కోలాటంలో అడుగులు కొన్ని నేర్చుకోని వుండడం, వీధి భాగవతుల అడుగులు కొన్ని చూడడం మూలంగా అడుగులు తొందరగానే నేర్చుకుంటున్నాను. కానీ ఆ రాత్రి కథలో తంబుర మీటడం, అడుగులు వేయటం, అందెలు మోగించటంలో లంగరు కుదర్లేదు. కాళ్ళాడితే, చెయ్యాడదు కాస్త తికమకగా వుంది. కథ అయిపోయినాక రామకోటి కొంచెం హాస్యధోరణిలో తిమక, మకతికగా నడిచింది కథ అని నిదానంగా కుదుర్తుందిలే బాధపడకన్నాడు.

ఆ తెల్లారి... రెంటపాళ్ళ గుడ్డి జంగం గారిని కోటి వీరయ్య అంటారు. కోమట్లింటో ఆయన్ని దినానికి పిల్చారు కథ చెప్పడానికి. రామకోటి, మేము ముగ్గురం కథ జాగ్రత్తగా విన్నాం. సముద్రమథనం, దేవదానవులు పాల సముద్రాన్ని చిలికే ఘట్టంలో 'గిరగిర గిరగిర కవ్వము త్రిప్పుచు కేకలు వేయుచును, జరజర జరజర సాగుచుండును, పరువడి తరచినను పటపట పటపట పండ్లు కొరుకుచు ఎటు తిరిగెదువేగ...' ఈ ధోరణి రగడలు అన్నిటికన్నా మిన్నగా నన్నాకర్షించాయి. నేనీ రగడలు పోరాట యుద్ధఘట్టాల్లో పాడితే ఈలలు కేకలు చప్పట్లతో నేల దద్దరిల్లేది. అంతే కాదు. ఆ కథలో దానవుల ఘట్టంలో అచ్చమైన 'బ్రహ్మతాపం వచ్చునా మేనారజేసి ఇచ్చగించి తోకబట్టి మా నారాయణా... ఇది మీసమా మంజారపు వాసమా నారాయణా...' అనే రగడను కూడా రోష వేషంలో ప్రదర్శిస్తుంటేను కొన్ని చోట్ల జనంలో ఊగ్రాలు పెరిగి 'గోవిందా' అంటూ లేచే వాళ్ళు. లేచే వాళ్ళు లేస్తూంటే వాళ్ళ నెత్తిన నీళ్ళు పోసేవాళ్ళు పోస్తూ వుండేవాళ్ళు. ముఖ్యంగా మాచెర్ల చెన్నుని గుడిముందు పల్నాటి యుద్ధం చెప్పినప్పుడు బాలచంద్రుని యుద్ధఘట్టంలో ఇదేతంతు. గుంటూరు పళ్ళదుకాణాల వద్ద కథలో ఊగ్రాలు పెరగటం ధూప, దీపాల

తంతు జరిగింది. ఒక చేత తంబుర మీటడం, రగడమీది కళ కనుగుణంగా ధ్వని మాలికలను ప్రకటించడం రెండో చేత లయబద్ధంగా అందెలు వాయించడం నాట్యం, అంగాంగాలు నటించటం లంగరు కుదరడానికి దాదాపు మూడునెల్లు పట్టింది. అప్పటి వరకూ లోపం జనాలకు కన్పించకుండా రాగ, సాయిలతో హావ, భావ ప్రకటనలతో జనాలను ఆకర్షిస్తూ వచ్చాను. రాంకోటి హాస్యంతో కమ్మేవాడు. శ్రీ దొడ్డవరపు వెంకటస్వామి కథ ప్రారంభంలో ఆలపించే సాయి ననుసరించాను.

'శ్రీధేనువ గిరిధామ యదుకుల క్షీరాంబుధి సోమా
శ్రీ గోపాలా రాధా లోలా శ్రిత జన మందారా'

ఈ సాయను కొంత అభివృద్ధి చేశాను. ఉస్తాద్ అబ్దుల్ కరీమ్ ఖాన్ ఆలపించిన 'కంరేబాంద్' అనే కీర్తన లోని కొన్ని మలుపుల, మెలికలను, పై సాయిలను, తారాస్థాయిలను, మనజాతి జానపద గానం బాణి చెడని రీతిలో ఇంకాస్త రుచిగా ఇంపుగా వుండే రీతిలో ఖాన్ సాహెబ్ బాణీని కొంచెం అనుకరించాను. చిన్ననాటి భజన పాటలు, కోలాటం, వీధి భాగవతుల పాటల సాయిలు, ఎరుక చెప్పే సింగి సోదిబాణీలో సాయలను, ముస్లింపెళ్ళిలో వాయించే చిన్న షహనాయిలో మర్మాల సాయిలు, మసీదుల్లో నమాజు సాయిలు, కృష్ణ చెంచులు జంటగా వాయిస్తూ జేగంట వాయిస్తూ పాడే సాయలు, దేవచెంచులు వీరణం వాయిస్తూ, వీరతాళ్ళు మోగిస్తూ పాడే సాయలు వారి ఆడంగులు ముద్దకోసం ఇంటింటి ముందు పాడే, చిటికిడే ముద్దమ్మ నారాయణ, మూకుడే పప్పమ్మ నారాయణ, ఓ వడ్డిచ్చే తల్లో, అనే రిథములో సాయలూ బవినీలు, పంబల, జక్కుల (బుర్రకథల) సాయలూ ఇవన్నీ వెనుకటి నుండి వంశపారంపర్యంగా వస్తున్న తెలుగు గానానికి చెందిన బాణీలన్నీ వారి వద్దనే నేర్చాను. తెలుగు ప్రాచీన గానం వీరి వద్దనే ఉన్నదని నా నమ్మకం. అందువల్లనే నేను వీటినెంతో జాగ్రత్తగా వింటూ అనుకరిస్తూ అవసరమనుకున్న చోట బుర్రకథ సాయల్లో కలుపుతూ వస్తున్నాను.

నా నటన ఊహాజనితమైనది. కాస్తో కూస్తో ఈ కళతో సంబంధమున్న జంగాల జాతిలో పుట్టిన రామకోటి యీ మేళవింపుల్లో అట్లా కాదిట్లాని, యిది యిక్కడ కాదు ఆ ఘట్టంలో పాడమని ఆ రగడలు, ఆ సాయలూ పాడి, పాడించేవాడు. మా బాగోగుల నిర్ణయానికి మేమనుకున్న ఘట్టాల్లో ప్రజల ప్రతిస్పందనలే రుజువులు. ప్రజలు ఏకదృష్టితో చూడ్డం, చెవులు రిక్కించి వినడం మేము బాగా మెప్పించామనడానికి గీటురాయి. కథ కాగానే రామకోటిని చూసి నవ్వటం, నన్ను పొగడడం జరిగేది. రామకోటి హాస్యంలోకి కొత్త చెణుకులు, పిట్టకథలు దేవులాడేవాడు. కథలో ఘట్టాల కనుగుణంగా అడుగులు, గంతులు, కుప్పీలు తాను ఆడుతూ నన్ను ఆడించేవాడు. జనం నన్ను పొగుడుతుంటే

వాడానందించేవాడు. మెత్తటి మాంసం ముక్కలు, చేపలు మంచివి నేను తింటుంటే ఆనందించేవాడు. రిక్షావాడినైనా ఏమండీ అనే సంస్కారి. అట్లాంటి రామకోటి నాకు తోడు వంతగా అమరటం నే చేసిన మహత్తరమైన పూజల్లో వొకటి. రామకోటి నుంచి నేను కథ చెప్పటంలో మెలుకువలే కాదు. చాల నేర్చుకున్నాను. పేదను గౌరవించి, ప్రేమించటం, ఆదరించుట, మనకున్న దాంట్లోనే ఇంత పెట్టటం ఎన్నో మానవతా లక్షణాలను, కళాత్మక నడవడిని నేర్చుకున్నాను. సహృదయుడు, త్యాగమూర్తి, పరోపకారి నాకు కథలో వంతకావడం నా అదృష్టంగా నేను భావిస్తాను.

విజయవాడలో జరిగిన రైతు మహాసభలో వేలాది మంది చూస్తున్న వేదికపై మేము సోవియట్ వీరవనిత 'టాన్యా' బుర్రకథ చెప్పాము. చాల బాగుందన్నారు. కానీ కథలో విషయం కథావస్తువు జాతీయమైంది కాదని పెద్దలు నిర్ణయించి నాకు రెండో బహుమతి ఇచ్చారు. గుంటూరులో ప్రజానాట్యమండలి స్థాపించాము. మ్యూజికల్ సామాన్లు, హార్మోని, తబలా, దిల్‌రుబా, డోలక్, మృదంగం, తంబుర తెప్పించాము. రామకోటి వైలెన్, పురుషోత్తం సారంగ నేర్చుకుంటున్నారు. మా నాట్యమండలి సభ్యులు కాకుమాను సుబ్బారావు, బి. గోపాల్, కె. బాల రామయ్య, పూర్ణచంద్రరావు, లక్ష్మీకాంత మోహన్, రామకోటి, పురుషోత్తం, మోటూరు ఉదయం, చింతల కోటేశ్వరమ్మ, విమల మున్నగువారు. 'జిల్లా ప్రజానాట్యమండలి'గా ఏర్పడినాము. కోలాటం, గ్రూపు డాన్సులు, చెంచులు, ఫకీర్లు, పగటి వేషాలు, పిట్టలదొర, ప్రసంగాలు పల్లెల్లో మీటింగులలో బహిరంగ వేదికలపై ప్రదర్శిస్తున్నాము. 1943, 44లో కమ్యూనిస్టు పార్టీ ఆధ్వర్యంలో చేస్తున్నాము. కథలుచెప్పించుకునే గ్రామాలు, పట్టణాలలో కట్నాలు, కానుక లెంతెంతిచ్చేవారో మాకే తెలియదు. మా సభ్యులకొక్కరికి పదహారు రూపాయలు. మా భార్యాభర్తలకు ముప్పయ్‌రెండు రూపాయల జీవనభృతి ఇచ్చేవారు. మేము వొక్కొక్కరమే సమిష్టి భోజనశాలకు పదహారు రూపాయలు జమకట్టేవాళ్ళం. మా నాయకులు, మేము వొకే చోట తినడం, ఉండడం, మాకు రూముల్లో మంచాలు, దిండ్లు, పెట్టెలు ఏమీలేవు. ఒంటిమీద బట్టలు తప్ప మరో జతలేదు. నా భార్య కళ్ళ జబ్బు బాగా ముదిరింది. పార్టీ వెంటనే తెనాలి వెంపలి సూర్యనారాయణ ఆస్పత్రిలో చేర్చి ఆమె మంచిచెడ్డలు మందుమాకులను చూస్తూ వుంది. అట్లా సంవత్సరంన్నర జరిగింది. ఒకరోజు వెంపలి సూర్యనారాయణ నన్నుపిల్చి నాజర్ ఈమె కళ్ళు ఇట్లానే వుంటాయి. పూర్తిగా నయం చేయగలిగే వైద్యం యిప్పట్లో లేదు కనుక ఈమెను పొయ్యి దగ్గరకు వెళ్ళకుండా, భార్యా భర్తల సంబంధం లేకుండా ఉంటే చానాళ్ళు బతుకుద్ది లేకపోతే కళ్ళు కాయలు కాస్తాయి అనగానే గుండె ఝల్లుమని ఆమెను గారపాడులో వదిలి వచ్చాను.

డాక్టర్ గరికపాటి రాజారావు ఆధ్వర్యంలో 'రాష్ట్ర ప్రజానాట్య మండలి' లోకి మా ముగ్గుర్నీ తీసుకున్నారు. నేను మా భూమి నాటకంలో జమీందారు, క్రిప్స్ రాయబారంలో నవాబు, వీధిభాగవతంలో భూపాల పాత్ర ధరిస్తూవున్నాను. సభ్యులతో డప్పుల డాన్సు, కూచిపూడి, భరతనాట్యం కూడా నేర్చుకున్నాను. కథల నాటకాలు, విచిత్రవేషాలు వేస్తూ రాష్ట్రమంతా కమ్యునిస్టు పార్టీ ప్రచారాన్ని చేస్తున్నాము. అహమ్మదాబాదు ఆలిండియా నాట్యసభ్యుల జానపద కళల పోటీలో ప్రథమ బహుమతి మా దళంకు వచ్చింది. వొక్క తల్లీ బిడ్డల వలె యువతీ యువకులం కలిసి మెలిసి తిరిగే పార్టీలో నాకు బ్రహ్మచర్యం బాధాకరంగా ఉంది. నాకు రాత్రుళ్ళు, పగలు నిద్రలో కట్టుబట్టలు తడిచేవ్యాధి ఆరంభమైంది. డాక్టర్ సోమసుందరంగారిని మందు అడిగాను. దానికి మందులేదు పెళ్ళి చేసుకోమన్నారు. ఈ విషయం పార్టీ వాళ్ళకు చెప్పాను. పుచ్చలపల్లి సుందరయ్య నీ భార్యను ఒప్పిస్తే పార్టీ పెళ్ళి చేస్తాను అన్నారు. భార్య, అత్తమామ లెవ్వరూ ఒప్పుకోలేదు.

కొరిటిపాడులో విడాకులు తీసుకున్న అమ్మాయి తండ్రికి వంద యిచ్చి దొంగపెళ్ళి చేసుకొని విజయవాడ తీసుకెళ్ళాను. పెదపూడి చారిత్రక విగ్నాన రాజకీయ పాఠశాలకు వెళ్ళాం. అక్కడ, ఆర్థిక సాంస్కృతిక శాస్త్ర పరిశోధకులు కథారచయితలు కొడవటిగంటి కుటుంబరావు, పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రి, మల్లంపల్లి సోమశేఖర శర్మ, నిడదవోలు వెంకట్రావు, శ్రీశ్రీ మున్నగువారు క్లాసులు పెట్టి అనేకానేక విషయాలు వివరించారు. నేను పాఠశాలలో చాలా నేర్చాను. ముఖ్యంగా పాటలు, గీత, సీసపద్యాలు రాయటంలో, యతులు, ప్రాసలు కొంచెం కొంచెం తెల్సుకున్నాను.

బొల్లిముంత శివరామ కృష్ణ ఎగతాళిని పట్టించుకోక పాటలురాయడం మొదలు పెట్టాను.

'వలియ వలియ వలియ
రావేలు గలవాడ రార పొలిగాడ
చేలు పండి మూలనిండ పల్లెపట్టు చల్లగుండ
కల్లమంతా కాలు మునగాలోయ్ ॥వలియ॥

కురిసెరా తొలకరి ఓరన్నా
కోటేరు లాయరా రైతన్న
కరువులో దేశము సురిగిపోనున్నది
పరువులో ఏరువాక పరుగెత్తి కొచ్చింది
పంట పైరాయెరా ఓరన్నా
ప్రజల బతికించరా రైతన్నా ॥వలియ॥

అలాగే పద్యం కూడా రాశాను.

ఆ.వె. పచ్చి పులుసు కారపప్పచ్చళ్ళు పుల్నీళ్ళు
కూరలేని కూళ్ళు కుక్క తిళ్ళు
గోచిలేని వాళ్ళు గొడ్డు చాకిరిగాళ్ళు
పల్లెపల్లె లందు పేదవాళ్ళు.

నేను చిన్న చిన్న పాటలు పద్యాలు రాస్తున్న రోజుల్లో 1944లో బెంగాల్లో వరదవొచ్చి పంటలు, ఊళ్ళు కొట్టుకుపోయి పెద్ద కరువువచ్చింది కూడుదొరకని ఆకలి జీవులు బస్తీలకు తండోపతండాలుగా వచ్చి కలకత్తా వీధుల్లో పులి విస్తరాకుల కోసం పందులు, కుక్కలు, మనుషులు కొట్లాడుకుంటున్నారని, పండుటాకుల వలె దారుల్లో, డొంకల్లో ముదుసళ్ళు, పిల్లలు, రాలిపోతున్నారని ఆవేదనతో రాస్తున్న దిన, వారపత్రికలు చదువుతున్న నా కళ్ళు నీళ్ళు నిండాయి. ఇంతలో

వెళ్ళిపోదామా మామా వెళ్ళిపోదామా
వెళ్ళి పోదామా పట్నవాసపు కుళ్ళు వీధుల్లో పడి
ఈన మోపై ఉన్న పైరుల ఏటి మలుపుల పాలుజేసి
పొట్ట చేత పట్టుకొని పట్టెడు కూటికై ఊరేగవలెనా
వెళ్ళిపోదామా మామా వెళ్ళిపోదామా
ఒడలు పెంచిన గడ్డమీదే ఒరిగిపోయే రాత లేదే
ఊరుగాని ఊరిలో చితిపేర్చుకోమని నొసటివ్రాలు ॥వెళ్ళిపోదామా॥

ఈ పాట చదువుతుంటే ఆనాడు కృష్ణానది ఒడ్డున ఏడుస్తూ పలికిన నా తల్లి కళ్ళల్లో కనిపించింది. నా కష్టాలు దినపస్తులు గుర్తుకొచ్చాయి. నా కళ్ళు చెమ్మగిల్లి పేపర్లో పాట కన్పించలేదు. వెంటనే కళ్ళు తుడుచుకొని 'బెంగాలు కరువు' బుర్రకథ వ్రాశాను. విజయవాడ హనుమంతరాయ గ్రంథాలయంలో అభ్యుదయ రచయితల సభలో చెప్పాను. కథ ముగింపులో ఆనాడు పాకిస్తాన్ సమస్యపై రాజీకుదరక ఎడముఖం పెడముఖంగా వున్న గాంధీ, జిన్నాలను గూర్చి

'గుమ్మాన యుద్ధ రాకాసి దేశాన కరువు పిశాచి
దేశమందు (దోపిడి) తిండిదొంగలు దాచివేసిరి తిండిగింజలు
దేశాన సంక్షోభమొచ్చును దీన జనులెందరో చచ్చును
మన గాంధీ జిన్నాలు మరలా కలవాలని
మనమంతా ఏకమై కోరాలోయ్'

అనిర్వాసి పాడాను. సభలో మేధావులు, రచయితలు, రాజకీయ నాయకులు గొప్పగా పాడినారు అని నాది అభ్యుదయ రచన, ప్రజాభాష అన్నారు. సుందరయ్య నన్ను కౌగలించుకొని నా బిడ్డ ఎంతో ఎదిగాడు అని మెచ్చుకున్నాడు. అభ్యుదయ పత్రికలో అట్టమీద నా ఫొటో వేశారు. ఆంధ్ర సభలో 'బెంగాలు కరువు కథ' విన్న గోవిందరాజుల సుబ్బారావు మద్రాసు ఆంధ్ర మహాసభలో 'నాజరు మా జిల్లావాడు గుంటూరు గోంగూర దెబ్బ' అని నవ్వించారు. నాటి ప్రముఖ సినీ డైరెక్టర్ శ్రీ గూడవల్లి రాంబ్రహ్మంగారు తన ఆఫీసుకు రప్పించి నాజర్ తెలుగు చరిత్రయైన పల్నాటి వీరగాథను కథగా వ్రాసి చెప్పమని తాను సేకరించిన చరిత్ర గ్రంథాలను, ఆయన రాసుకున్న స్క్రిప్టును నా కందించారు. దీనివల్ల నీకు భుక్తి, ముక్తి కూడా లభిస్తాయన్నారు.

బాపట్ల హైస్కూలు ఆవరణలో యువజన మహాసభలో నాకథ విన్న నటశేఖర బళ్ళారి రాఘవాచారి కరువు ఘట్టంలో దుఃఖితమయై కన్నీళ్ళు కారుస్తూ అధ్యక్ష పీఠం పైనుంచి వేదికపైకి వచ్చి కౌగలించుకుని ఆశీర్వదించారు. తమ తల్లి సంస్మరణ రోజున బళ్ళారిలో నా 'బెంగాలు కరువు కథ'ను ఏర్పాటు చేశారు. ఆనాడు కథలో డబ్బులు, బట్టలు ప్రోగుచేసి కమ్యూనిస్టు కరువు కమిటీల ద్వారా బెంగాలుకు పంపాము. బందరు పట్టణ ప్రజల సహకారంతో శ్రీ పినపాల నాగభూషణం గారు, కళాకారులు నందం సుబ్బారావుగారిచేత సరికొత్త రూపంలో పనసకర్రతో తంబుర తయారుచేయించి వేలాది మంది సమక్షంలో నాకు బహుమతిచ్చారు.

ప్రముఖ పాత్రికేయుడు శ్రీ కె. అబ్బాస్ 'బాంబే క్రానికల్' పత్రిక ఆఖరు పేజీలో బొమ్మవేసి పేజి మొత్తం నా గురించి వర్ణిస్తూ 'ఆంధ్ర అమరషేక్' అని అభివర్ణించారు. ఈ దశలోనే 'మాభూమి' నాటకంలో 'కమల' పాత్రను జమునకు నేర్పాను. దుగ్గిరాలలో నాటకం ఆడించాను. దేశంలో పేదప్రజల సమ్మెలు సత్యాగ్రహాలు నానాటికి చినికి చినికి గాలివాన అయినట్లు సాయుధ తిరుగుబాట్లకు దారితీస్తున్నది. ఒకనాటి ఆంగ్రేజి పాలకులు అల్లూరి సీతారామరాజు యుద్ధం బుర్రకథను నిషేధిస్తే ఈనాడు కాంగ్రెస్ పాలకులు 'మాభూమి' నాటకాన్ని నిషేధించారు. అంతేకాక దాని నిర్మాణసంస్థనే నిషేధించారు. పేద ప్రజలను సాయుధ పోరాటానికి పురిగొల్పుతున్నది భారత కమ్యూనిస్టు పార్టీ అని ఇంత తొందరగా దేశమంతటా వ్యాపించుటకు దాని ప్రజా సంఘాలు బలపడుటకు ముఖ్యంగా 'నాజరు బుర్రకథ'లని ఈ ప్రభుత్వం ప్రకటిస్తూ పార్టీపైనా, ప్రజానాట్య మండలిపైనా ఆంక్షలు విధించింది కాంగ్రెస్ ప్రభుత్వం. ముఖ్యనాయకులు రహస్యంగా ప్రజల్లో పనిచేయవలసి వచ్చింది (సెమీ అండర్‌గ్రౌండ్).

ఆ కష్టకాలంలో కళారంగాన్ని చూస్తున్న మద్దుకూరి చంద్రంగారు ప్రజానాట్యమండలిని 'ప్రజాశక్తినగరు'లో సమావేశపరిచి రాజారావు, నాజరు, సోదరులారా కళారంగాన్ని ప్రత్యేక వైజ్ఞానిక సంఘంగా నిర్మించకపోవటం వాటి పోషణ అవి చూచుకొనే రీతిలో తీర్చి దిద్దుకొన లేకపోవటం పార్టీ చేసిన ఒక తప్పుగా తెలుసుకున్నాము. అంతేకాదు కళారంగాన్ని పార్టీకి అనుబంధ సంస్థగా, పార్టీ ప్రచార దళంగా నడుపుకొనుట మరో పెద్ద తప్పని నిర్ణయించినారు. ఈ కారణములచేతనే కమ్యునిస్టుపార్టీతో పాటు ప్రజానాట్యమండలి అనుబంధ సంస్థలు కూడా ప్రభుత్వ నిర్బంధ విధానాలకు గురికావలసి వచ్చింది. కనుక ప్రజానాట్యమండలిని రద్దు చేస్తున్నాము. సభ్యులు ప్రస్తుతం ఎవరి ప్రాంతాలకు వారు వెళ్ళి ఎవరి బ్రతుకు వారు బ్రతుకుతూ ఏరియా కమిటీలలో పనిచేయమన్నారు. వెంటనే పార్టీ ఏరియా కమిటీ సభ్యులుగా చేరమన్నారు.

నేను నాభార్యా పొన్నెకల్లు చేరాం.

చుట్టు ఉన్న హరిజనవాడల్లో కూలీ సంఘాలను, పాలేళ్ళ సంఘాలను, రైతు సంఘాలను, వైజ్ఞానిక దళాలను ఏర్పాటు చేస్తున్నాము. హార్మోనియం బాగుచేయించి గుడిపూడి, మోతడక, నిడుముక్కల, వేమల్లె, కర్లపూడి దగ్గర పల్లెల్లో పాటలు, నాటకాలు నేర్పుతూ వాళ్ళతోనే ఉంటున్నాను. ఒక ఇంట్లో వేళకు అన్నం చాలక పోతే ప్రక్కింట్లో తెచ్చి పెడుతున్నారు. పల్లెల్లో పొట్టనింపుకుంటున్నాను. నాభార్య, తల్లి తిండి యేమిటి అని బుర్రకథ మానేశానని ఇంట్లో దమ్మిడీ ఇవ్వటల్లేదని మా పెద్దమ్మలు నా భార్యతో వేరే వుండమన్నారు. మా పెద్దమ్మలు, మా అమ్మతోపాటు నా భార్య కూడా కూలికి వెళ్ళుతున్నది. నేను గ్రామాల్లో భూస్వాములకు కన్పించకుండా, పోలీసులకు అగుపించకుండా సంఘాలను నిర్మిస్తూ వారితో పాటు పొగాకు కట్టుబడి, బేరను పన్లకు కూలి పన్లకు వెళ్ళుతూ ఆ అనుభూతులతో పాటలు వ్రాస్తున్నాను. నా భార్య, మా అమ్మ కూలిపన్లకు వెళ్తూ పొట్టపోసుకుంటున్నారు. ఇంట్లోకి ఇది కావాలని, వంటికి సొమ్ములు అని అడిగి యెరుగదు నా భార్య.

ఏనాటికానాడు ఎండ వానల్లోన
సేసి సేసి ప్రాణం విసిగిపోతున్నది
కూడుజాలని కూలి ఓరన్న – దొరల
కుక్కలే నయమురా కూలన్నా
అర్ధరేతిరికాడ నిద్దరే లేస్తాము
బిడ్డలారా మీకు దేవుడే దిక్కని కాలమీడ్చుకుపోదురు మీరన్న – నిద్ర
కళ్ళతో తూలుతూ కూలన్నా

చేలోకి చేరాక మెలుకువేరాక
బండ్ల కాకేశాక పండ్లని తోముతూ
మారురూపాయితో ఓరన్న
ఇండ్లు చేరుకుంటామురా కూలన్నా
ఆదరా బాదరా ఆకంత దింపాక
ఆవురావురు మంటూ అన్నాని కెళ్తే
కూడుంటే కూరుండదు ఓరన్నా - మరింట్లో
పాడి అసలుండదు కూలన్నా
తాలుగింజలు కూడు తెల్లకారపుకూర
చేదు నోటికి పోదు బాధ దేవుండెరుగు
ఏడుపే తరుగురా ఓరన్నా
ఏందిరా యీ బతుకు కూలన్నా
పచ్చాకు తెస్తిరని పిండాకు లెక్కువని
పని తొందర లేదని పరువు దక్కదని
వెనుక సనుగుడు మోపు ఓరన్నా-దొరల
కెంత జేసినా మెప్పు లేదన్నా
ఏ పూటా వెంట వుండి వేపుకుని తింటారు
కూలడిగితే తప్పు - కూడడిగితే ముప్పు
కులమంటారు ఓరన్నా! దొరలు
కలవనివ్వరు మనల కూలన్నా!
ఏ కులం వారైన ఏ దేశంలో నున్నా
పేదలంతా ఒకటే బాధలన్నీ ఒకటే
కులం కూడెట్టదు రా ఓరన్నా
కలిసి పోరాడాలి కూలన్నా

ఆనాడు కూలీలకు నేర్పి వ్యవసాయ పనుల్లో సమిష్టిగా పాడించిన పాట దీని సాయి 'లంబాడోళ్ళ రాందాసు' జానపదం.

ఎండల్లో వానల్లో నీడనక నిద్రనక
పండిస్తాము సంపదలు (పంటలను) పస్తులుంటము రోరన్నా!
ఉప్పుంటే పప్పు వుందా? ఉండబోతే కొంప వుందా ?
బ్రతుకంతా వెతలాయె నా చిన్నారి కూలన్నా

దినమంతా శ్రమచేసే జనమంతా పస్తులురా
నీ పొలము జనబలము
పేదోళ్ళ శ్రమ ఫలము
సోమరుల సొత్తాయె
శ్రామికుల సత్తాయె
నీ శక్తి, నీ యుక్తి, పేదోళ్ళ ధీశక్తి
ఏకంగా నిలవాలి
లోకాల నేలాలి
బ్యారను పన్లు చేస్తున్న రోజులు
ఎన్నాళ్ళీ కాపురాలు
ఏ చెరో సురో బడి చేద్దామన్నా ॥ఎన్నాళ్ళీ॥
కాపురమంతా కరువుల సంత
జీవిత మంతా చిరుగుల బొంత
గాలికొంపలు, ఖాళీ కుండలు
చాలీచాలని కూలి గింజలు ॥ఎన్నాళ్ళీ॥

పారపనుల్లో పారుకులాడి
సత్తువ కొద్దీ కత్తవ దొక్కి
సతమతమయి నే మెతుకుల కెళ్తే
కుండడుగున కూడుండదురన్నా ॥ఎన్నాళ్ళీ॥

చేలన్నీ నా చెమటన దడిపి
నేల బురద నాటును నాటి
కళ్ళ ప్రాణాలతో ఇల్లు జేరితే
పిల్లలు తింటే తల్లులు పస్తు ॥ఎన్నాళ్ళీ॥

పంటల నేసి కల్లాల నేసి
వీపున మోసి పాతట పోసి
కూలిస్తుంటే తాలిస్తుంటిరి ॥ఎన్నాళ్ళీ॥

రాజనాలు పండించేవానికి, భోజనానికి బొత్తిగ లేదు
పేదల కష్టం ప్రభువుల పాలు, బాధలన్నీ మన పల్లెల పాలు ॥ఎన్నాళ్ళీ॥

ఆ నాడు పాలేళ్ళను గురించిన పాట తెలంగాణ ప్రాంతంలోనిది
'బండెనక బండి కట్టి పదహారు బళ్ళు గట్టి' అనే సాయిలో

ఏరన్నా రాక ముందే – ఏర్వాక వచ్చెరన్న
ఎవరింట ఉందువన్న – ఓరన్న జీతగాడ
భూమిని దుక్కి దున్ని – పైరూల నెల్ల సాకి
సోమారి పోతులను –సాకాలి యెల్ల కాలం
తెలియార తెలివి తోడ – కలవారి జీతగాడ ॥ఏరన్న॥
పండిన కూరగాయ – పంటిన కొరకవాయె
కమ్మని కందిపప్పు–కనరాదు నేతిబొట్టు
ఉప్పాకే నీ ముఖాన – గొప్పోరి జీతగాడ ॥ఏరన్న॥
పొద్దున్నే సద్దికూడు – మద్దేల నీలకూడు
కొద్దిగా జీతమాయె – పద్దాక తోముడాయె
పెద్దోరి భాగ్యమట్ల – పోగాయె జీతగాడ ॥ఏరన్న॥
కంటికి నిదర లేదు – వంటికి సుఖంరాదు
రోగాలు వచ్చి పడిన – నాగాలు తప్పవన్న
ఇదేమీ బతుకురన్న – ఓరన్న జీతగాడ ॥ఏరన్న॥
ఇన్నీటి కోర్చిఉన్నా – ఏ రోజు తిట్టులన్నా
గట్టిగా మాటలాడ – కట్టేసి తన్నుదురన్న
ఈ బతుకు వద్దు పదరో – పోరాడు జీతగాడ ॥ఏరన్న॥
ఈ గనులు మన వెరన్న – ఈపనులు జనులవన్న
ఈ పంట భూములన్నీ – కాజేసె దొరలు మొన్న
నీబలం చూపుమన్నా – ఈ పొలం పంచుమన్నా
నీ వెతలుతీరునన్న – ఓరన్న జీతగాడ ॥ఏరన్న॥

1947, 48 మధ్య కాలంలో చాలా పాటలు రాశాను. ఆ పుస్తకాన్ని పోలీసు లెత్తుకు పోయారు.

ఈ జీతగాళ్ళ సాధక బాధకాలు గురించిన పాట విన్న 'మోతడక భూస్వామి బిడ్డ' "ఏరా కులం, గోత్రం లేని వెధవ జీతగాళ్ళకు చద్దన్నాలు గాక వేడిగా వార్చి పెడతారంటరా" అంటూ నడివీధిలో ఛెళ్ళున చెంపదెబ్బ కొట్టి జేబులో పార్కర్ పెన్ను లాక్కుని వెళ్ళాడు.

ఈ విషయం తెలిసిన హరిజన యువకులు, పెద్దలు గుంపుగా వెళ్తే పెన్నిచ్చాడు. కొట్టలేదని అబద్ధం చెప్పి తప్పుకున్నాడు.

తాడికొండ పోలీసులపై రాళ్ళేశారనే నెపంతో నన్ను పదిహేను రోజులు రిమాండు జైల్లో కుక్కారు. తాడికొండ పోలీసు స్టేషనుపై మారణాయుధాలతో దాడిచేయ వచ్చారని, చేశారనే కేసుల్లో కోర్టు చుట్టూ తిరిగాను. నిత్యం సి.ఐ.డి.లు వేలు కదిల్తే పోలీసుల దేవులాట పల్లెల్లో కనిపిస్తే భూస్వాముల కొట్లాట పూటపూటకు తిండికి కటకట ఇది ఆ నాటి నా బతుకు, నిండు గర్భవతి నా భార్య బావినీళ్ళు తోడబోయి తాగాడి మధ్య కాలుజారి బావిలో పడిందని, ప్రమాదకరమైన దెబ్బలు తగిలాయని గుంటూరు ఆసుపత్రిలో చేర్చగా ఆమె అన్న తీసుకెళ్ళాడనే కబురందింది.

ఏం చేయాలీ బాధలన్నీ నన్నే కోరి వరించాయి. రాత్రికి రాత్రే వెళ్ళి చూచుకోని ఏడ్చుకున్నాం. కొరిటిపాడు అత్తవారింటి పక్క నిమ్మ, నారింజ తోటలో తలదాచుకుంటూ తోటమాలి అవతారంలో వుంటూ ఆమెకు మందులిప్పించాను కాని ఆమె దక్కలేదు. మిత్రుల సహాయంతో అప్పుడు అక్కడ జరుపవలసిన కర్మకాండ రహస్యంగా జరిపించాను. పుట్టెడు దిగులుతో పొన్నెకల్లు వచ్చాను. మళ్ళీ పెళ్ళాం లేని వాణ్ణయ్యాను.

ఇంటి పేరు లేకుండా పోతుందని అమ్మ కుమిలిపోతుంది. ఈ నిర్బంధంలో నాకు పెళ్ళి వద్దనుకుంటున్నాను. పార్టీమీద నిషేధం తొలగించారని నాయకులు బహిరంగ వేదికలపై ఉపన్యాసాలిస్తున్నారు. నా గురించి సి.ఐ.డి.ల విచారణ పోలీసు వ్యాన్లు రావడంలేదు. గారపాడు మామపిల్ల పెళ్ళికి యెదిగిందని రమ్మన్నాడని కబురందింది. అమ్మల పోరు పడలేక ఒక్కణ్ణే గారపాడు వెళ్ళాను. మామ కూతుర్ని చూచాను. బాగుంది. కానీ మా మామ ఛీ ఫో అని కోప్పడ్డాడు. ఇరుగు పొరుగు అమ్మలక్కలు ఏం చెప్పారో కానీ సాయంత్రానికి చల్లబడి పడుకున్నాడు. ఇంతలో పెంచినమ్మ వచ్చి "తమ్ముడా వాడింటి పేరు నిలబడేట్టు చూడు. పెద్దపిల్లకి నేను ముప్పాతిక, వాడికి అరెకరం రాసి యిస్తాను. దానిమెడలో నగలు నీవు తీసుకుని అర ఎకరం నీవు రాయి చిన్నపిల్లని వాడికి చేద్దాం" అంది.

1942లో మొదటి, 46లో రెండో, 48లో మూడోపెళ్ళి ముప్పావలా ఖర్చుతో చేసుకున్నాను. మోతడక పల్లి, కర్లంపూడి పల్లె, గుడిపూడిపల్లె, ఇట్లా నేను సంఘాలు పెట్టి పని చేస్తున్నాను. చుట్టు పేద ప్రజలు చీరలు, జాకెట్లు, కుట్టించి తోడ్పడినారు. తాళ్ళూరులో చందాలు ఇచ్చారు. పెండ్లి జరిగిన పదమూడో రోజున ఓనర్ సుబ్బయ్య "ఓరే తుళ్ళూరు భూస్వామిపై దాడి జరిపి చంపేశారు మన వాళ్ళు" అని ఆదుర్దాగా చెప్పాడు. నేను కంపన పడిన కాకిలా ఊరొదిలి పోతుండగానే ఇంతలో పోలీసు వ్యాను దూసుకుపోయి లైబ్రరీ సెంటర్లో ఆగింది.

నేను హోటల్ సందులో నుంచి బయలుదేరగా కాంగ్రెసు వాలంటీర్లు నాకెదురొస్తున్నారు. తటాలున గుర్రం కోటయ్య గారి బ్యారనులో దూరాను. ఇంతలో మిలటరీ వచ్చి ఇల్లు సోదా చేస్తున్నారు. జీతగాడి గుడ్డలు నేను, నేను కట్టిన గుడ్డలు జీతగాడికిచ్చి గొడ్లదగ్గర పేడతట్టలో వేసి గంప నెత్తికెత్తుకొని ఇండ్ల చాటుగా ఉడాయించి మంగలడొంకన నిడుముక్కల కొండవెనుకగా మోతడక కొండెక్కాను. పల్లె కుర్రాళ్ళకీ సంగతి చెప్పాను. వారంతా గురూ కాపు సారా బానల వద్ద కాపలా ఉంటున్నాము గనుక ఇక్కడే ఉంటే తిండి తిప్పలూ మాతో పాటే ఉందువన్నారు. మళ్ళా పెళ్ళాం దారి పెళ్ళానిదే నాదారి నాదే. ఏమీ తెలియనిది మేనమామ బిడ్డకావడం. రహస్యజీవితం నాటి నుంచి గడుపుతున్నాను. మాఇంటి చుట్టూ మూగారు కాంగ్రెస్ వాలంటీర్లు, పోలీసులు ఇదేం ఇల్లురా తడికలైనా లేవు. పొగాకు బేరను పట్టాలు కట్టారు అని ఆ పట్టాలు చించారు. కందికంప దడులను తుపాకీ మడమలతో పడదోశారు. వండుకునేవి, నీళ్ళుతాగేవి, కుండలు, చెంబులు, జాడీలు నట్టింట చితక పొడిచారు. పచ్చడి జాడీలు పగులగొట్టి పచ్చడి తొక్కి కిర్సనాయిలు కలిపారు. "ఏయ్ ముసలిదానా నీ కొడుకుతో చెప్పి కోర్టుకు హాజరుకమ్మను. లేదంటే తంబుర వేలు నరికేస్తాం. దొరికాడో కాల్చేస్తాం. వాణ్ణి పట్టుకున్న వారికి బహుమతి ప్రకటించాం అని ఆ సన్నాసికి చెప్పు" అని వెళ్ళారు.

పొన్నెకల్లు దక్షిణ భుజం, పేరేచర్ల, కొండవీడు, కొండలసోలుకు నల్లమల పర్వతాలు తాకినది. అట్లాగే ఉత్తర భుజం పిడుగురాళ్ళ, గుడిపూడి, నిడుముక్కల, మోతడక, వేమల్లె ఇట్లా చెదురుమదురుగా వింధ్య పర్వతాన్ని తాకినవి కొండలు. నేను మోతడక కొండ గుహలో మకాం బెట్టాను. ప్రొద్దుట పిల్లలు తట్టలో అన్నం, బుర్రలో మంచినీళ్ళు తెచ్చిస్తున్నారు. నేను రెండు పూటలా ఆ అన్నం ముద్దనే సరిపెట్టుకోవటం, నీళ్ళు తాగటం. కాగితాలు పెన్సిలు తెచ్చి ఇస్తే పాటలు కథలు రాసి అవి తీసుకెళ్ళి దినపత్రికలకివ్వటం చేస్తున్నాను.

ఆ రోజు మోతడక పల్లెలో బంతి భోజనమని నన్ను చీకట్లో గుహలో నుంచి తీసుకొచ్చి ఖాళీగా ఉన్న చిన్న పూరింటిగదిలోకి తీసుకొచ్చారు. అక్కడ మా అమ్మ, భార్య కనిపించారు. నా భార్యది చాల చిన్న వయసు, అమాయకురాలు. తెల్లవారగట్ట కోడికూతతో లేచిన మా అమ్మ ఇంటి చుట్టూ కాంగ్రెస్ వాలంటీర్లు, సి.ఐ.డి.లు, పోలీసులు తిరుగుతూ తిడుతూ గందరగోళంగా ఉందని నా భార్యను గారపాడు తీసుకుపోయింది. నేను కొండెక్కాను. ఈ జరిగిన విషయాలన్నీ కాంగ్రెస్ అభిమాని ప్రెసిడెంటు గారితో చెప్పాడు. ఆయన పెద్ద బరిసెతో తిట్టుకుంటూ కొండ వద్దకు వచ్చాడు. పల్లె యువకులు పరుగున వచ్చారు. పల్లె పెద్ద ఫాదర్‌బాబు వచ్చి నాజర్ కొండల్లో ఉంటే నేనెట్లైనా పంపుతాను. ఎలుక కోసం

ఇంటికి చిచ్చు పెట్టుకుంటామా వాడికోసం మనం తగువులాడుకోవద్దని చెప్పగా అంతా వెళ్ళిపోయారు. ఫాదర్ సందేళ నన్ను కొండదింపి ఇంట్లో అన్నం పెట్టి కొండచుట్టూ మిలటరీ పెట్టి వెతికించాలని ఊరి పెద్దలు గూడుపుఠాణి చేస్తున్నారు. కనుక 15 రోజులు ఎక్కడికైనా వెళ్తే నీకు మాకు మంచిదన్నారు. ఆ రాత్రి ఒక తాడ పుగాకు తెప్పించి ఒక పట్టాలో చుట్టాను. ఒక త్రాసు తెప్పించి మడిగోచి పెట్టి పంచెగట్టాను. కుర్రవాణ్ణి వెంటనే తీసుకొని పట్టానెత్తిన త్రాసుచేతితో పట్టుకుని తెల్లవారే సరికి నల్లపాడు,సౌడులు దాటాను. కారెక్కితే కనుక్కుంటారని, ఊళ్ళల్లో నుంచి వెళ్తే కాంగ్రెస్ కార్యకర్తలు లక్ష ప్రశ్నలు వేస్తారని వూరి వెలుపల కాలి నడకతో రాత్రి పది గంటలకు గారపాడు చేరాను. అది నా భార్య అమ్మగారి వూరు. నాకన్నా ముందే మా అమ్మ గారపాడు బస్సులో పంపింది నా భార్యను. మా చెల్లి యిల్లు ఊరిబైట యానాదుల ఇళ్ళ దగ్గర. మా చెల్లిని లేపాను. నన్ను చూడగానే ప్రాణం లేచివచ్చినట్లు అయి పెరుగు పిడత గుమ్మరించి అన్నం పెట్టింది. భోషాణం పక్క చాపపై పడుకున్నాను. మామయ్య చేపలు పట్టుకొచ్చాడు. తెల్లారి ఇదిగో వదినా చేపల కూర అని మా సతి వచ్చింది. మాచెల్లికి కూర యిస్తున్నట్లు వంకతో వచ్చింది.

నాటకాలు ఆడే నాటి నుండీ యానాదుల కుర్రాళ్ళకు నేనంటే ఎంతో అభిమానం. చాలా కాలం ఆ ప్రాంతంలో ఉన్నాను. నేను తెల్లారగట్ల వాళ్ళ కంటబడినా చూసీ చూడనట్లు వెళ్ళేవాళ్ళు. చాలా జాగ్రత్తగా నాతో మసలుతున్నారు. గారపాడు కాంగ్రెసు వాలంటీర్లు పెద్ద పెద్ద కర్రలతో అర్ధరాత్రి మాచెల్లెలి యిల్లు ముట్టడించారు. నేను రోజూ మాదిరిగానే అంతకు ముందు ఒక్క గంట ముందే వెళ్ళి యానాదుల గుడిసె ముందు పొగాకు పట్టా తల కింద పెట్టుకొని పడుకున్నాను. ఇంకా నిద్రపట్టలేదు. ఈ గోల గమనించి లేచి తుమ్మల చెరువుకు అడ్డం పడి ఒక్క అరగంటలో కుర్నూతల రోడ్డు దాటాను. కొండవీడు కొండెక్కాను. కాలిదారిన మెల్లగా సాయంత్రానికి ఆ దరికి కొండవీడు గ్రామంలో సరిగ్గా దిగాను. ఆ పరిసర గ్రామాల ప్రజలు నన్నంతగా ఎరుగరు. కనుక పల్లెలు దాటుకుంటూ రామకోటి ఊరు తాళ్ళూరు చేరాను. రామకోటి, నేను, తోడుగా తెలంగాణా కుర్రాడు తోడైనాడు. సత్తెనపల్లి స్టేషన్లో చీమ చిటుక్కుమంటే చేరవేస్తున్నారు. ఈతబొందల్లో, తాటి తోపుల్లో పడుకుంటున్నాం పగలు ఊళ్లోనే కాపలా పెట్టుకుని ఉంటున్నాం. అవకాశాన్ని బట్టి దొరికింది తింటూ రహస్య జీవితం గడుపుతున్నాం. ఆ రాత్రి అచ్చమ్మ పేట పోలీసు స్టేషన్‌పై దాడి జరగడం అది కమ్యూనిస్టు దళాలపనే నని ఎస్.ఐ. భార్య ఆ దాడిలో మరణించడంతో పోలీసు, మిలటరీ, తాళ్ళూరు చుట్టు ముట్టి కమ్యూనిస్టులకై ఇల్లిల్లు గాలిస్తున్నారు. అసలెటు మెసలటానికి, తలబైట పెట్టడానికి వీలు లేనంత ఇరకాటంలో పడ్డాను. కోతికొమ్మచ్చి ఆడుతూ చిన్న పిల్లలు పోలీసు చర్యలు చెప్తున్నారు.

ఇక్కడే మిలటరీ దాడులు తట్టుకోవడం బాధాకరంగా వుంది. నేను, దేవులపల్లి వెంకటేశ్వరరావు, రాత్రి సందె చీకట్లో రాత్రి అన్నం తిని బయలుదేరాము. కాలినడకనే ఊళ్ళల్లో, బరిసెలు పట్టుకుని ముఠాలు, ముఠాలుగా, గుమిగూడి కాపలాలు కాస్తున్నారు. ఊరు తగలకుండా చేలకు, బీళ్ళకు అడ్డంపడి పురుగు, పుట్రా, తేలు, పాము, అని చూడక, భయపడక నడచి కరకర ప్రొద్దుపొడుస్తుండగా మోతడక కొండ పడమరకు చేరాము. వెంకటేశ్వరరావు గారు ఆయన దారిన ఆయన వెళ్ళాడు. నేను కొండెక్కి సొరాయి, వూట బానల వద్దకు చేరాను. కొండపై కుర్రాడు ఊళ్ళోకి కబురంపాడు. మిత్రులు అన్నం మూటతో, నీళ్ళ బుర్రకాయతో, తెల్లకాగితాలతో వచ్చారు.

నిప్పులు చెరిగే ఎండ కొండగుహలో మగ్గిపోతున్నాను. ఆవేదనతో మైళ్ళకు మైళ్ళు నడవడం, వేళకు తిండి, నీళ్ళు, స్నానాల్లేవు. కంటికి నిద్రలేదు. కాళ్ళు యింతింత లావున వాచి బండలయ్యాయి. ఆ సాయంత్రానికి వళ్ళు నిప్పుల కుంపటి వలే మండిపోతున్నది. గడగడ వణుకుతూ గొడ్డువలె మూల్గుతున్నాను. కాపలా వున్న కామ్రేడ్ ఊళ్ళోకి పరుగెత్తాడు.

**నా** తంబుర వేలు నరికేస్తానన్న కొండంటి కాంగ్రెస్ వాలంటీరుగా ఉన్న కుర్రాడు ఇంట్లో పిచ్చుక గూడు లాగేయబోతే ఏదో కుట్టి చచ్చాడన్న వార్తతో మా అన్నయ్య నా దగ్గిరికి వచ్చాడు. మాఅన్నయ్య నన్నాస్థితిలో చూచి బావురుమన్నాడు. నాకూ ఏడ్పు ఆగలేదు. ఇద్దరం ఏడ్చుకున్నాం. "ఒరే నీ సంగతి రామిరెడ్డిగారు పట్టించుకుంటానన్నాడురా అన్నాడు. రామిరెడ్డిగారు పోలీసు స్టేషనుకి వెళ్ళి నీ సంగతి చెపితే ఎస్.ఐ. గారు బాధతో ఇక్కడకు చేర్చండి అతని ప్రాణం నేను కాపాడుతానన్నారు" అని చెప్పారు. అని నా వైపు చూశాడు. "సరే నువ్వెళ్ళు రామిరెడ్డి గార్ని రేపు మధ్యాహ్నం కోమట్ల అరుగుమీద కూర్చోమన్నానని చెప్పు" అని చెప్పాను. "ఏది ఏమైనా నాయీ పరిస్థితిని ఆదంబికి, గారపాడు వాళ్ళకు, మనవాళ్ళకు తెలియనివ్వకు" అన్నాను. అన్న వెళ్ళిపోయాడు. దక్షిణం వైపు పీర్ల చావడికి ఎదురుగా బండచాటున కూర్చున్నాను. మిత్రుడెళ్ళాడు. నేను ఎవరికీ కనిపించను, కానీ నాకు అంతా కనిపిస్తున్నారు. ఎర్రని ఎండలో రెండు దాటే వరకు ఆగాలి. వడగాలి, నరసంచారంలేదు. మెల్లగా లేచి కొండదిగి మురహరి, చిగురుపాటివారి యిండ్ల సందులో చరచరా దూరి ఆ సందుకు ఎదురుగా దక్షిణపు సరిహద్దులో వున్న ఉత్తరపు వాకిట్లో దూరిలోని కెళ్ళాను. నన్ను చూచి నా కోసమే యెదురుచూస్తున్న ఎస్.ఐ. "నువ్వు నాజరువా" అని అడుగుతుండగా రామిరెడ్డిగారొచ్చారు. అవునన్నాను. ఇద్దరూ నవ్వుకుంటూ వుండగా యింతలో గదిలో పెట్టి తాళం పెట్టారు పోలీసులు. కొంతసేపటికి బయట కాంగ్రెస్ వాలంటీర్లు పెద్ద కర్రలతో కేకలతో ఎస్.ఐని గద్దిస్తున్నారు. నాజరును వదలమని గదమాయిస్తున్నారు.

ఇంతలో మంగళగిరి నుండి మిలటరీ వ్యాను రానేవచ్చింది. నన్నా వ్యానులో కెక్కించారు. ఊళ్ళో ప్రజలకీ వార్త తెలియగానే జనం అంతా రోడ్డు పక్క నిల్చిపోయారు. ఆదుర్దాగా చూడాలని, త్రొక్కిసలాడుతూ కన్నీరు కార్చారు. అడ్డరోడ్డు పుగాకు కంపెనీలో పన్జేసే మా అమ్మకీ వార్త తెలిసి రోడ్డుమీద కొచ్చి నన్ను చూసి పెద్ద కేకపెట్టి చింత చెట్టుకింద అట్లానే పడిపోయింది. వెనకనే మా అన్నయ్య వుండి వాడికి బొబ్బలు తగ్గటానికి ఆయింటుమెంటు యిచ్చారనగానే లేచి అమ్మ, మా బిడ్డ అమాయకుడు, మంచోడు, సత్యవంతుడు వాడికన్యాయం చేయకండి వాడు చేసేపని తప్పులేదని ముఖం కడుక్కుందట. నన్నా మిలటరీ క్యాంపులో ఏవేవో రహస్యాలు, నాయకుల చర్యలు చెప్పమని, మీకు అన్నాలు పెట్టే ప్రజలెవరని, రాయనపూడి దాడిలో ఎవరున్నారో చెప్పమని నాల్రోజులు బాగా తన్నారు. దళాలదాడులతో పార్టీ పోరాటాల కార్యక్రమాలతో ఆర్గనైజర్లతో నాకు సంబంధం లేదని పార్టీ విషయాలేవీ తెలియనిచ్చేవారుకారని వాపోయాను. ఆ నాలుగు రోజులు నా ఏడుపు అరణ్యరోదనమన్నట్టుంది. వాస్తవంగా కమ్యూనిస్టుల మీటింగులలో, మహాసభల్లో ఊళ్ళల్లో జరిగే పెళ్ళిళ్ళు ఉత్సవాలు, వేడుకలున్నా కథలు చెప్పేవాడినని ఇప్పుడు నన్ను విడిచిన పిదప కూడా బుర్రకథలే నా జీవనాధారం అని కలెక్టరు కల్యాణరావుతో ఆఫీసర్లతో మొరపెట్టుకున్నాను.

కూలీలు, పాలేళ్ళు, పేదరైతుల, కౌలుదార్ల పన్నుల కష్ట నిష్టూరాల సాధక బాధకాలను వివరిస్తూ పాటలు రాశాను. ఆయా సంఘాల యువకులకు నేర్పాను. వేదికలపై వారి చేత పాడించి నేను పాడినమాట నిజమేనని అంగీకరించాను. ప్రజానాట్యమండలిలో చిత్ర విచిత్ర వేషాలేశానని, మాభూమిలో కుర్ర జమీందారుగా నటించానని చెప్పాను. నన్ను పార్టీ విషయాలు అడగటం, తన్నటం మానేశారు.

రాత్రుళ్ళు క్యాంపుల్లో కాపలా వున్న మిలటరీ కుర్రాళ్ళు మధ్యాహ్నం, రాత్రిళ్ళు ఘంటసాల పాటలు, పద్యాలు నా చేత పాడించుకుంటూ వారు పాడుతూ నన్ను ప్రేమగా చూస్తున్నారు. అధికారులు తినగా మిగిల్చిన అన్నం కారేజీలు నాకే అందిస్తూ వుండేవారు. రోజులు, వారాలు గడుస్తున్నాయి. ఓ రోజు అర్ధరాత్రి నన్ను, మరి నలుగురు కుర్రాళ్ళను వ్యానులో ఎక్కించారు. వ్యాను కదిలింది. మా వ్యాను రైల్వేగేటు ముందు ఆగింది. రైల్వేగేటు మూతపడింది. రైల్వేస్టేషనులో రైలు గుయ్‌మని కూసింది. మా ముందుగా తుపాకీ గుండు వలె రైలు దూసుకుపోయింది. గేటు తెరిచారు. ఇంతలో గుంటూరు నుంచి వచ్చిన టాక్సీ, మా వ్యాను పక్కనాగింది. ఏవో గుసగుసలాడారు. వెంటనే వ్యాను, టాక్సీ వెనుదిరిగి మంగళగిరి క్యాంపు దగ్గరకొచ్చి ఆగినవి. “మీ పెళ్ళాల తాళ్ళు గట్టివి దిగండిరా” అన్నాడో పోలీస్ అధికారి. బిలబిలా దిగాం, ఒకరి ముఖాలొకరం చూసుకున్నాం. ఆ రోజు రాత్రే

కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు కామ్రేడ్స్‌ను కాల్చివేసే కార్యక్రమాన్ని నిలిపివేశారనే విషయం అధికార్లకు చెప్పటానికి 'కలెక్టర్' కల్యాణరావు వచ్చారని తెల్లారి నాక తెలిసింది. ఇట్లా చావుదప్పి కన్నులొట్టబోయిన సామెతగా ముప్పయ్ రోజులు పోలీసు క్యాంపులో గడిపాము. ఆనాటి ఉదయం ఎనిమిది గంటలకు మళ్ళీ నన్ను వాహనాలలో ఎక్కించారు. నేను తత్తర బిత్తర పడ్డాను. నోట్లోమాట రావట్లేదు, నాలుక తడి ఆరిపోయింది. వ్యాను గుంటూరు తాలూకాఫీసు ముందాగింది. నన్ను దిగమని పోలీసులు సబ్‌జైల్లో పెట్టారు. అది తెలియగానే మా వాళ్ళంతా వచ్చారు. వార్ని చూచి నా ప్రాణాలు లేచి వచ్చాయి. కటకటాలానుకొని నిల్చున్నాను. పదిహేను సంవత్సరాలు కూడా నిండని, చదువు కొద్దిగైనా చురుకుగా వున్న నా భార్య మీసాలు, గడ్డాలు పెరిగిన నన్ను చూసి నవ్వి కటకటాలు పట్టుకుని నుంచుంది.

చిన్నగా "నిన్ను విడిచి పెడతారంట గదా" అని నవ్వుతూ అడిగింది. "అవును" అన్నాను. "మంచి చేపలు తెస్తానని మానాన్న చెప్పాడు నిన్ను గారపాడు రమ్మన్నాడు" అన్నది. జైలు నుండి బైటకొచ్చాను, మిగిలిన మిత్రులం ఒకచోట చేరుకున్నాం. జరిగిన తప్పొప్పులు రకరకాలుగా చర్చించుకుంటున్నాం. జరగాల్సిన వాటిని గూర్చి టీ తాగుతూ బల్లలు గుద్దుతూ చెప్పుకుంటున్నాం. తెలంగాణ సాయుధ పోరాటం ఆగింది. ఆయుధాలు దళాల నుండి లాగి యిచ్చేశారు. నాయకులంతా బైటకొచ్చి పార్టీని పునర్నిర్మించుకున్నారు. నేను సమావేశాలకు హాజరౌతున్నాను. పార్టీ నుండి పారిపోయినోళ్ళు పోలీసులతో తిరిగినోళ్ళు ఊళ్ళో సమావేశాల్లో పెద్ద ఫోజులు కొడుతున్నారు. ఇంతలో సర్క్యులర్ వచ్చింది. పార్టీలో కార్మిక, గ్రామీణ వ్యవసాయ కూలీ నాయకత్వ నిష్పత్తి తక్కువైందని. ఆ లోపాన్ని సవరించేందుకు ప్రొలిటేరియన్ లీడర్ షిప్‌ను పెంచాలని చంద్ర రాజేశ్వరరావు పేర సర్క్యులర్ వచ్చింది. కానీ పార్టీ పునర్నిర్మాణం ఆ సర్క్యులర్‌కు పూర్తిగా వ్యతిరేకంగా వుండడంతో నేను గ్రామ పార్టీకి దూరంగా వుంటున్నాను. నచ్చిన సాహిత్యం చదువుతున్నాను. ఏమీ తోచనప్పుడు పేకాట ఆడుతున్నాను.

1920 నుండి 1949 వరకు యిదీ నా కథ.

రామకోటి వుత్తరం రాశాడు. రామకోటి వుత్తరంలో ఇలా రాశాడు. ప్రియమైన నాజర్‌కు పార్టీ మనకిచ్చిన కార్యక్రమం తప్పనుకుంటున్నాను. వేలాది ప్రజలకు ఆర్థిక, సామాజిక, రాజకీయ నడవడికలను సాంస్కృతిక చరిత్రలను కథలుగా హాస్యంగా హావ, భావ, నటన, గానాలతో ముగ్ధులను చేసి కార్యోన్ముఖులను చేసే మనలను విడదీసి ఏరియా కమిటీలలో పనిచేయమనటం. కనుక 'నాజర్‌దళం' పేరుతో కథలు చెప్పుదాం. త్వరలో పొన్నెకల్లు వస్తాను అని.

'కష్టజీవి' కథలో మధ్యతరగతి, ధనిక రైతు బిడ్డలైన నాగయ్య,భీమయ్య అనే వాళ్ళను కల్పించి కమ్యూనిస్టు నాయకులుగా, త్యాగమూర్తులుగా చిత్రించి ఆడి, పాడి మేము ఏడ్చి జనాలను ఏడ్పించి మధ్య తరగతి, ధనిక రైతు యువకులు కమ్యూనిస్టులుగా పార్టీ నాయకత్వాన్ని ఆక్రమించేటట్లు చేశామని భావిస్తున్నాను. కింది కులం కమ్యూనిస్టు కళాకారులుగా అది మేము చేసిన తప్పు.

చదువు, విజ్ఞానం లేని గ్రామీణ కార్మిక, కర్షక కూలీలను, నాయకుల వేషాల్లో వున్న ధనికరైతుల కాళ్ళ క్రింద పడవేశానని గొప్ప తప్పు జరిగిందని గమనించి 'కష్టజీవి' కథ చెప్పటం మానేశాను. మరో కథ రాయడానికి దేవులాట ప్రారంభించాను.

జాతీయ సాహిత్యం పేరుతో వున్న తెలుగు వేదాలు, ఉపనిషత్తులు, మను, వసుచరిత్రలు, కుమార సంభవం, కళాపూర్ణోదయం, మేఘ సందేశం, మున్నగు పద్య పంచకావ్యాలను, వాత్సాయన కామసూత్రాలు, నాట్యశాస్త్రములు, అభినయ దర్పణాలు, భరతరస ప్రకరణాలు, భాస నాటకాలు చదివాను. వీటిల్లో ఉన్నదంతా ప్రేమ, కామ, శృంగార, రతిక్రీడ, వ్యసనములు. రారాజుల దౌర్జన్యాలు, పెత్తందార్ల భోగభాగ్యాలు, దయా, ధర్మాలు, ముక్తి, మోక్షాలు, దైవభక్తి దగాకోరు నిర్వచనాలు తప్ప, సామాన్య తెలుగు ప్రజల కష్ట, నిష్ఠూరాలు, తిండి, దేవులాటలు, సాధకబాధకాలు, కంచుకాగడాతో వెదికినా కానరాలేదు. మద్రాసు ఆంధ్ర మహాసభ హాలులో బెంగాలు కరువు కథ విని శ్రీ గూడవల్లి రామబ్రహ్మం నన్నాశీర్వదించి యిచ్చిన పల్నాటి యుద్ధం చిత్తు ప్రతిని చదివాను. అందు బ్రహ్మనాయుని చాపకూటి సిద్ధాంతము, వర్ణ ధర్మాల పేరుతో వున్న తరతరాల తెలుగు జాతిని తగువులతో వేరుచేస్తున్నాం. కుల, మతాల వ్యతిరేకత, అందరినీ తమ బిడ్డల వలె చూడడం, నాకు నచ్చాయి. 'బెంగాలు కరువు' రాసి నంత తేలికగా పల్నాటియుద్ధం రాయలేనని భయపడి 'ప్రయాగ కోదండరామ శాస్త్రి'గారి శిష్యుడైనాను.

శ్రీ శాస్త్రిగారి ప్రోత్సాహంతో దేవులపల్లి కృష్ణశాస్త్రి, గురజాడ, శ్రీశ్రీ, మొదలగు వారి గేయాలు బట్టీ పెడుతున్నాను. చలం, కుటుంబరావు కొడవటిగంటి, గోపీచంద్, అనేకమంది సాహిత్యాన్ని, చదువుతున్నాను. బెంగాల్‌కథ, వ్యవసాయ కూలీలపాటల పుస్తకం యివ్వమని పోలీసుస్టేషన్లు చుట్టూ తిరుగుతూ ఎస్.ఐ.లను బతిమాలుతున్నాను. అప్పుడే తగలేశాం, చించేశాం అన్నారు. అడగటం మానేశాను. కథ రాయటం, చించటం, శాస్త్రిగారి సహకారంతో పెదపూడి పాఠశాల అనుభవంతో నాకు తెలిసిన యతి ప్రాసలతో నాభాషా పాండిత్యంతో 'పల్నాటి యుద్ధం' బుర్రకథను గీసేశాను. రామకోటికి వినిపించాను. మేమిద్దరం కలిసి మార్పులు, చేర్పులు చేశాం. 'శృంగారలహరి' కృతిని ప్రార్థనా గీతంగా పెట్టాము. రాజకీయం కోసం పురుషోత్తం దగ్గరికి వెళ్ళాము. ఆయన సంసారబాధలతో

మతి చలించి ఎటో పోయాడన్నారు. ఆ సంగతి చెప్పి కుటుంబ సభ్యులు బావురుమన్నారు.

విజయవాడ హనుమంతరాయ గ్రంథాలయంలో ఆడుతున్న నాటక కంపెనీలో నాటికల్లో, నాటకాల్లో చిన్న చిన్న వేషాలు వేస్తున్న కర్ణాటి లక్ష్మీనరసయ్యను రమ్మని జాబు రాశాను. లక్ష్మీనరసయ్య ఓ జత బట్టలు, దుప్పటితో మాయింటికొచ్చాడు. లక్ష్మీనరసయ్య కృష్ణాజిల్లా ప్రజానాట్యమండలి సభ్యులు. బుర్రకథ దళంలో హాస్యమంతా మా భూమిలో మంగలి రాముగా ఆడేవాడు. గాత్రంలో శృతి పక్వత, శ్రుతి జ్ఞానం లేకపోయినా కలిసిపోయి పాడే గుణం కనిపించింది.

డైలాగు చక్కగా చెప్తాడు. వేషం, రాజకీయవంతకు చక్కగా కుదిరాడు. లక్ష్మీనరసయ్య నాకు మల్లే దరిద్రుడు. తెనాలిలో ఆలపాటి వెంకట్రామయ్య, మంతెన వెంకట్రాజు గార్ల ఆధ్వర్యంలో కాంగ్రెస్ సభలో జరగబోతున్నవని ఆ సభలో వైజ్ఞానిక ప్రదర్శనలు పెట్టాలని, మంచి ప్రోగ్రామ్స్ పెట్టాలని పత్రికా ప్రకటన వచ్చింది.

రామకోటి నేను కాంగ్రెస్ సభలో కథ చెప్పాలని నిశ్చయించి గుర్రం లక్ష్మయ్యగార్ని ఏమైనా సరే ఆ సభలో ఛాన్సులు యిప్పిస్తే బావుంటుందని కోరాం. ఆ సభలో మొదటి కథ పల్నాటి యుద్ధం. బాగుంది కానీ ఇతను ఏ నాజరో తెలియక తక్కువమంది వచ్చారు. కష్టజీవి చెప్పమన్నారు. ప్రధాన కథకుడు నాజర్, రామకోటి హాస్యం, రాజకీయం లక్ష్మీనరసయ్య అని రెండు రోజుల ముందు చుట్టూ కరపత్రాలు పంచి బాగా ఎనౌన్స్ చేశాం. నాజర్ బతికే వున్నాడని బళ్ళు కట్టుకుని, అన్నం కట్టుకొని తిరునాళ్ళకు వచ్చినట్టు వచ్చారు చుట్టుపట్ల జనం. కాంగ్రెస్ వాలంటీర్లు యువకార్యకర్తలు, చివుకుల వెంకటేశ్వర్రావు గారి అనుయాయులు పేచీపెట్టారట. కాంగ్రెస్ ప్రసక్తి తేలేదు. తంబురపై నున్న సుత్తి, కొడవలి, తలపై యంత్ర చిహ్నం, కాంగ్రెస్‌కు జై అన్పించాలనగా, ఆలపాటి వెంకట్రామయ్య, మంతెన వెంకట్రాజు ఎవరి ఇష్టం వాళ్ళది, జేజేలు కొట్టడంలో పొద్దు సరిపోతుంది, మరి ఎర్రనక్షత్రాలు, కొడవళ్ళు కంటే, గాంధీబొమ్మను బంగారం, వెండి తోనే చేయించి తగిలించండి వద్దంటే అప్పుడు మాట్లాడదాం అని అన్నారు.

నేను వేషం వేసుకొని వేదిక గేటు దగ్గరకు రాగానే సరైన బట్టలు లేకుండా, మురికిగా ఒకతను నా దగ్గరికి వచ్చి బిక్కమొఖంతో నాకళ్ళల్లోకి చూస్తూ "ఆగండి బాబూ మీరు కాంగ్రెసు లోకి చేరిపోయారా" అన్నాడు. నా గుండెల్లో గునపాలు గుద్దినట్లయింది. "నేను ఏమయ్యానో నా కథ విన్న తర్వాత చెప్పు" అని వేదిక ముందు కూర్చోబెట్టాను. నాటి కాంగ్రెస్ సభలో కథ చెప్పిన నాటి నుండి పోలీసుల వేట తగ్గింది. కాంగ్రెస్ వాలంటీర్లు కృష్ణా, గుంటూరు జిల్లాల్లో టిక్కెట్టు కథలు ఏర్పాటు చేశారు.

కట్నం అయిదు వందల రూపాయలు. లక్ష్మీనరసయ్యే చూస్తున్నాడు డబ్బు వ్యవహారమంతా. నందిగామలో తడికెల హాల్లో టిక్కెట్టు కథ పెట్టారు. తెలంగాణాలో నాజర్‌ను, రామకోటిని చంపారనే పోలీసు పుకారు విన్న ప్రజలు మా కథ చూడడానికి తండోపతండాలుగా వచ్చారు. హాలు పట్టలేదు. తడికెలు పీకేశారు. మహాసభవలె దండలు, రూపాయల దండలు, జిందాబాద్‌లు, కౌగలింతలు. రంగులు తుడుచుకొని స్టేజి మీద కొచ్చి కనపడుతున్నాం. కథలో డబ్బులు బాగా వస్తున్నాయి. కాంగ్రెస్ కార్యకర్తలు గంపలగూడెం, తిరువూరు ఆ పరిసరాల్లో చాల కథలు ఏర్పాటు చేశారు. కృష్ణా, ఉభయగోదావరి, గుంటూరు, ఒంగోలు జిల్లాల్లో ఎక్కువగా కథలు వస్తున్నాయి. డబ్బులు బానే పుచ్చుకుంటున్నాను. ఏ పార్టీ లేదు. సామాన్య మానవులకు రాజకీయం నేర్పడానికి ఎక్కువగా రాజకీయం వాళ్ళకి అర్థమయ్యే రీతిలో కొంచెం ఎక్కువగానే చెప్తుండేవాడిని. కథ నడపడంలో, రసాలలో, హావభావ నటనల్లో, రాగసాయిల్లో ప్రజల ఉనికిని బట్టి వారి ఆనంద, ఆర్భాటాల ననుసరించి కథను తీర్చిదిద్దుకుంటున్నాను. నాకు ఈ విషయాల్లో ప్రధాన గురువులు ప్రజలు, సలహాదారు రామకోటి, నాభార్య.

ఏ పార్టీ పేరు లేదు. హాస్యంలో స్వార్థ, లోభి, ధూర్త, లంచగొండి, అన్యాయాలను సమాజాన్ని ఏకి కాకులకేస్తున్నాను. 'చిన్న చిన్న రాళ్ళు చిల్లర దేవుళ్ళు' శ్రీనాథునిది దృష్టిలో వుంచుకొని

పచ్చిపులుసు కారపప్పుచ్చళ్ళు పున్నీళ్ళు
కూర లేని కూళ్ళు కుక్కతిళ్ళు
గోచిలేని వాళ్ళు గొడ్డుచాకిరిగాళ్ళు
పల్లె పల్లెలందు పేదవాళ్ళు

హాస్యపద్యాలు రాసి రామకోటితో పాడించాను. అంతేకాక చుట్ట పన్ను, అగ్గిపన్ను, చీపురుకట్ట పన్ను అంటూ పిట్టల దొరలాగ రామకోటితో విమర్శింపచేశాను. సందుకో సారాకొట్టు, పేటకో పేకాటక్లబ్బు, వీధికో వ్యభిచారగృహం ప్రజల్లో తలెత్తిన చెడులను కథల్లో విమర్శిస్తున్నాను. ఇంకా 'వాది నష్టం, ప్రతివాది ముదనష్టం, కోర్టులరిష్టం, ప్లీడరుదుష్టం' అనేది కూర్చి కోర్టును విమర్శించాను. ఇంకా ప్రజల్లో సోదులు, మంత్రాలు అనేవి మూఢనమ్మకాలకు సంబంధించినవి విమర్శించాను. వీటికి పురుషోత్తం కన్నా లక్ష్మీనరసయ్యే ప్రశ్నలకు సమాధానాలు బాగా చెప్తున్నాడు.

మా చందాలు తీసుకొని మమ్మల్నే తిట్టి పోతున్నావుగా అంటున్నారు పెద్దలు. మా దళాన్ని ప్రజలు తెగపొగుడుతున్నారు. ఈ ఆనందంలో మాకు ఇల్లే గుర్తురాలేదు. లక్ష్మీనరసయ్య బ్రహ్మచారి. నవరసాలు గుప్పించాము. డబ్బులు మస్తుగా వుంటంచేత

కూడు విషయంలో హోటళ్ళలో మొహమాటంలేకుండా తింటుంటే సర్వర్లు నవ్వేవారు. నీరసం రాకుండా తింటం, ఆయాసం లేకుండా ఆడటం పాడటం. నిజంగా కళాకారుడు గొప్పవాడుకావాలంటే భార్య ఓర్పు, నీతిగలదై వుండాలి.

ఒకనాడు గుంటూరు ప్రజానాట్యమండలి ఆర్గనైజరు 'కొండపనేని బలరామయ్య' మిలట్రీ దాడుల రోజుల్లో సినీపరిశ్రమలోకి వెళ్ళాడు. ఏదో పనిబడి విజయవాడ వచ్చి మమ్మల్ని కుశల ప్రశ్నలడిగి "ఏం సంపాయించార్రా" అని అడగగానే, మేము ఒకరి ముఖాలు ఒకరం చూసుకున్నాము. "మద్రాసు యాక్టర్స్ అంతా మీరు బాగా సంపాయిస్తున్నారనే అనుకుంటున్నారు. డబ్బంతా ఏం చేస్తున్నార్రా" అని అడిగాడు. నేను మొత్తం ఇరవై మూడు వందలుండాయి అని చూపెట్టాను. మూడు గడియారాలు, మూడు బంగారు వుంగరాలు కొనిపిచ్చాడు.

వీరుపాడు కథకు కంచికచర్ల బస్సు దిగాము. మంచి కోడెగిత్తల బండి తోలుకొచ్చారు. ముగ్గుర్నీ బండెక్కమన్నారు.

బండి డొంకదారుల్లో జట్కాలా పోతూంది. బండి సప్టాలో ఆగక పరుగులు తీస్తుంటే నేను బాగా భయపడి దూకాను వాగులోకి. అంతే లేవలేకపోయాను. ఎడంకాలు చీలమండ వాచింది. లేవలేకపోయాను. తడిగుడ్డ కట్టి నలుగురు కలిసి బండిలో పడేసి వీరులపాడు చేర్చారు. ప్రజలు విపరీతంగా వచ్చారని కూర్చుని కథ చెప్పటం మొదలుపెట్టాను.

మర్నాడు వెయిట్‌లిఫ్టర్ గుళ్ళపల్లి సూర్యనారాయణగారు ఈ వార్త విని నన్ను తన యింటికి తీసుకెళ్ళి నా భార్యను పిలవనంపినాడు. ఆయనింట్లో వంట చేసుకుంటూ కాలు తోమించుకుంటున్నాను. కామ్రేడ్ సూర్యనారాయణ రోజూ కాలు తోమి బోరు నీళ్ళ పోత తర్వాత మళ్ళీ తీసుకొచ్చేవాడు. ఆయన మంచి వెయిట్ లిఫ్టర్ కాబట్టి నన్ను మూడు నెలల్లో నన్ను నన్నుగా నిలబెట్టాడు. ముగ్గురం మూడు గదులు తీసుకుని వుంటున్నాము. కలో గంజో పంచుకుంటున్నాము. లక్ష్మీనరసయ్య అకౌంటెంటు. 1949లో భక్త ప్రహ్లాదలో హిరణ్యకశిపుడుగా నేను, రామకోటి ప్రహ్లాదుడుగా, లక్ష్మీనరసయ్య ఛండామార్కుడుగా రేడియో ప్రోగ్రాం యిచ్చాము. రేడియో కేంద్రంలో ఇంత మంచి ప్రోగ్రాం వినలేదని ప్రజలు ఉత్తరాలు రాశారు. సర్ హ్యూమ్ దొర నుంచి, గాంధీ, నెహ్రూ, ప్రకాశం వరకు కాంగ్రెస్ నిర్వహించిన సత్యాగ్రహాలు, సమ్మెలు, అల్లూరి సీతారామరాజు వంటి వీరయువకులు, నాయకులు, సైనికులు, తిరుగుబాటు వీరులు, ప్రాణత్యాగాలతో స్వరాజ్యం సాధించిన వివరాలతో 'స్వతంత్రభారతం' బుర్రకథ రాసి ఆకాశవాణి విజయవాడ ద్వారా విన్పించాను. డాక్టర్ రాజారావు 'పుట్టినిల్లు' సినిమా తీయబోతున్నారు. అందులో బుర్రకథ కూడా వుంది. మద్రాసు రమ్మని రాశారు. అప్పుడే ఆంధ్రరాష్ట్రం కోసం త్యాగమూర్తి యైన

మహా మనిషి, నిరాహారదీక్ష వహించిన పొట్టి శ్రీరాములు అమరజీవి అయ్యారు. ఆయన త్యాగదీక్షను గూర్చి సుంకర, వాసిరెడ్డిగార్లు రాసిన 'స్వాతంత్ర్య సంగ్రామ సన్నాహమందు' అనే సీసపద్యం ఆయన పాదాల వద్ద చదివే అదృష్టం నాకు దక్కింది.

'పుట్టిల్లు'లో రాణి రుద్రమ బుర్రకథ సుంకర రాయగా నేను సాయలను నాట్యాలను హావభావాలను కూర్చి రామకోటి మేము రికార్డు చేశాం. మిత్రులిద్దరివి వేషాలు వున్నాయి. వాళ్ళు సినిమాలో నటిస్తూవున్నారు. ఖాళీగా వున్న నేను 'ఆసామి' నాటకం రాసుకొంటున్నాను. మ్యూజిక్ డైరెక్టర్ ఎస్. రాజేశ్వరరావు నాపాటలో మాధుర్యం గాత్రం మెచ్చుకొని వాహినిలో అయిదు వందల జీతం యిప్పిస్తాను. నెలకో పాట పాడిస్తాను మద్రాసులో వుండమని కోరారు.

"అయ్యా క్షమించండి యిదో ప్రత్యేక లోకంగా వుంది నేనుండలేను" అని దళంతో విజయవాడ చేరాను.

'ఆంధ్ర ఆర్టు థియేటర్స్' సభ్యుల సలహాతో 'ఆసామి' పూర్తిచేశాం. మిత్రుడు ప్రభాశంకర్ కాపీలు రాసి నా కిచ్చాడు.

నా దోవలో నేనుండి పెళ్ళాన్ని మర్చిపోయాను. పసిబిడ్డ నెత్తుకొని బావకొడుకును తోడు తీసుకుని బెజవాడ వచ్చింది.

అక్కడ అద్దె ఇంట్లో కాపరం బెట్టాను. కథలు చెప్పుకుంటూ, కృష్ణా జిల్లా ప్రజానాట్య మండలి వారిని పోగుచేసి నాటకాలు రిహార్సలు ప్రారంభించాను. మాచినేని వెంకటేశ్వరరావు డైరెక్షన్, విన్నకోట రామన్నపంతులు, రామ్మూర్తి, రాఘవాపురి అప్పారావు, వెంగళనాథం, పురాణం వెంకట సుబ్బారావు, కాకర్లపూడి వెంకటరాజు, తమ్మిన రామారావు, జగన్నాధుని పిచ్చయ్య, శ్రీమతి కొప్పరపు సరోజిని, కుమారి కొమ్మినేని హైమావతి, మ్యూజిక్ బి. గోపాలం. నాజర్ బుర్రకథ దళం సభ్యులుగా నాటక రిహార్సల్స్ చేస్తున్నారు. కొప్పరపు సుబ్బారావు గారింట్లో, తర్వాత హనుమంతరావు గ్రంథాలయంలో మూడునెలలు నేర్చుకున్నారు. డ్రస్సు రిహార్సల్స్‌కు రాష్ట్ర కమ్యూనిస్టు నాయకులను ఆహ్వానించాము. చాల బాగుందన్నారు. రాష్ట్ర ప్రజానాట్యమండలి వద్దని, విజయవాడ ప్రజానాట్యమండలి అని పేరు పెట్టండని నాయకులు అన్నారు. మేము సభ్యుల వాటాలతో పాటు పార్టీకి కూడా డబ్బులు పంచుతామని పార్టీని కోరాము. అందుకు పార్టీ అంగీకరించలేదు. పాత ప్రజానాట్యమండలి కర్టెన్సు డ్రస్సు హార్మోనియం బూజు పట్టి పాడౌతున్నవి. మేము వాడుకుంటాం అన్నాము. అందుకుకూడా పార్టీ అంగీకరించలేదు. మొదటి నాటకం టిక్కెట్లు పెట్టి మేముగా గ్రంథాలయంలో ఆడాము. మొత్తం డబ్బులో ఖర్చులు పోను, విన్నకోట రామన్నకు, మాచినేని వెంకటేశ్వరరావుకు వాటా మినహాయించి మిగతా వాళ్ళకు

సమానంగా పంచాము. బందరు 'ఆంధ్రనాటక కళా పరిషత్' అష్టాదశ వార్షిక మహాసభలు 1954 మే లో బందరు 'మినర్వా'లో 'బెజవాడ గోపాలరెడ్డి' అధ్యక్షతన నాటక ప్రదర్శన పోటీల్లో ఉత్తమ ప్రదర్శనగా మా 'ఆసామి'కి ప్రథమ బహుమతి వచ్చింది. మొత్తం 8 ప్రైజులొచ్చాయి.

శ్రీ కొప్పరపు సుబ్బారావు ప్రముఖ రచయిత. మా నాటకం చూసి చాలా బావుందని 'ఆసామి' పీఠికలో చెప్పారు.

'వేములపల్లి శ్రీకృష్ణ'గారు తమ ప్రెస్సులో ప్రింటు చేశారు. తిరువూరులో నాటకానికి అన్ని ఏర్పాటు చేసి, పార్టీ సెంటరని పేపరు పంచాం. బ్రహ్మాండంగా ప్రచారం చేసినాము. ఇది పార్టీకి సంబంధించిన నాటకం కాదని ఎవ్వరో ప్రచారం చేయగా నాటకం ఆపి ఎటువాళ్ళం అటు పోయాము. రామకోటి నాతో చెప్పకుండా మద్రాసు వెళ్ళిపోయాడు. దళానికి హాస్యవంత కొరత పడింది. కుడి భుజం నరికినట్లయింది. అడ్వాన్సు తీసుకున్న కథలను మిక్కిలినేని రాధాకృష్ణమూర్తితోను, కోసూరి పున్నయ్యగారితో పూర్తి చేసి వంతకోసం వెతుకుతున్నాను. ముట్లూరి గ్రామంలో క్రైస్తవ కథలు చెపుతున్న నందిగం వెంకటేశ్వర్రావును తీసుకొచ్చి డక్కీ వరుసలు, రగడ సాయిలు, ఏ ఘట్టాల్లో ఎలా వాయించాలి, ఎలా నిలబడాలి, అన్నీ నేర్పి కథ సాగించాను. చదువు తక్కువైనా బుర్రకథ అనుభవం ఉన్నందున త్వరలోనే లైన్ అయ్యాడు.

కోయంబత్తూరు నుండి టెలిగ్రాం మనియార్డరొచ్చింది. రామకోటి అక్కడే ఉండాడని. లక్ష్మీ నరసయ్యను తీసుకెళ్ళాను. రైలు దిగినది మొదలు రాచమర్యాదలతో 'ఆచార్య ఆత్రేయ' వెంట తీసుకొని ఉడ్‌ల్యాండ్స్ శాకాహారశాలలో వుంచారు. ఆ చల్లని వాతావరణం, రుచి పచిలేని కాయగూరలతో భోజనం చేయడం వల్ల రొంప పట్టి జలుబు చేసింది.

శ్రీరాములు నాయుడుగారి 'దేవి' హోటలుకు ఆత్రేయగారు మార్పించారు. కోరిన మాంసం, గ్రుడ్లు, చేపలు, వెన్నరొట్టె తినడం వల్ల మందులతో పని లేకుండానే జలుబు, దగ్గు మాయమైనాయి. ఒక్క ఊరు మాంసాలు తినడం, బస్కీలు తీయటం, ఆసనాలు వేయటంతో పది రోజులకే పండిపోయాను. పందెపు కోళ్ళను మేపినట్టు మేపారు. స్టూడియోకి రమ్మని టాక్సీ పంపారు నాయుడుగారు. ఆ సినిమాలో రామకోటి కో వేషం వుంది. కనుక ముగ్గురం కలిశాం. నాజరుగారు మీరు మాకు కథ ఎప్పుడు వినిపిస్తారనగానే ఎల్లుండి పల్నాటి యుద్ధం వినిపిస్తాం వేషాల్తో అన్నాను. సినిమాలో ఏ కథ బాగుంటుందని నాయుడు ఆత్రేయతో అనగానే సినిమా కథ విన్న నేను ఆత్రేయగారితో అల్లూరి సీతారామరాజు కథ, అగ్గిరామునికి బాగా సరిపోతుంది కానీ బ్రిటీషు ప్రభుత్వ నిషేధం

వుందన్నాను. ఆత్రేయ కూడా అదే అన్నారు. నిషేధం నాకు తెలియదే అన్నారు నాయుడుగారు. నిషేధం గూర్చి నేను చూసుకుంటాను అదే చెప్పండన్నాడు.

కథ పదినిముషాలకు సరిపడ పదిహేను రోజుల్లో రాశాను. కథాంశం దెబ్బతినకుండా ఏర్చి కూర్చాను. కథ ప్రాక్టీసు పెట్టాం. రష్యా నుండి వచ్చిన సాంస్కృతిక బృందం వాడు పైస్థాయిలో ఆలపించి ఆ రాగసాయిలో అన్పించగా వారం ప్రాక్టీసు చేశాం. రాజుకు తుపాకి గుండు తగిలింది. "అబ్బా" అన్నచోట సూటిగా నాటిన తుపాకి గుండు రాజు గుండెలోనా అయ్యో! అన్నచోట పై స్థాయిలో అన్పించాడు. నిజంగా కథ ఎత్తుగడ కూడా రౌద్రంలో "ఆ వార్తయే రాజు కొచ్చె రా సై అగ్గిరాముడై లేచెరా సై" ఘట్టం పాడి ఆఖరిలో ఈ విషాద ఘట్టంలో ఆ రాగసాయి, ఆ నటన లో కథ నాకే ఎంతో బాగుందనిపించింది. మద్రాసులో సోవియట్ బృందంలో ఒక గాయకుడు తారాస్థాయిలో పాడాడు. ఆ స్థాయిలో నా చేత కూడా పాడించాడు రామకోటి. నేను పాడాక విని ఆ సోవియట్ బృందం పాడిన దాని కంటే ఆ సాయి నువ్వు పాడితేనే బాగుందని రామకోటి అన్నాడు. వేదికపై నటించి, ఆడుతూ పాడుతుంటే రామారావు, భానుమతి, నాయుడుగారు చూచే వారంతా గొప్పగా చెప్పుకున్నారు.

"అబ్బా" అన్న చోట సహజత్వం కోసం పదమూడు దఫాలు ఆ టేకే తీయించాడు. రామారావు, భానుమతి ఒకర్నొకరు చూసుకొన్నారు. భానుమతి లేచి "నాయుడుగారు నాజరుగారు చెప్పేది, ఆ ఉద్రేకం, ఊపు ఉన్నదున్నట్లు తీయాలంటే అమెరికా, రష్యాల వలె నాలుగు వైపులా కెమేరాలు పెట్టి తీస్తే వస్తాయి. కానీ ఒక్క కెమెరాతో ఆయన్ని శ్రమపెట్టక ఓ.కె. చేయండ"న్నారు.

నాజరు గారి వద్ద ఇంత గొప్ప కళ వుందని నాకు తెలియదు. ఇంత గొప్పగా బుర్రకథ కళారూపం వుంటుందనీ తెలియదు. ఇలాంటి ప్రదర్శన నేను ఎన్నడూ చూడలేదు. చాలా బావుంది అని భానుమతి అన్నారు. తొమ్మిది నిముషాల కథ రెండు రోజులు రికార్డు చేశారు. మ్యూజిక్ డైరెక్టర్ రికార్డింగ్ రోజు నాజర్ గారూ మైక్ మోత పెడుతోంది కొంచెం గాత్రం పెంచిపాడండి అన్నారు. అది విని నాయుడుగారు – సౌండు ఇంజనీరేం చేస్తున్నాడయ్యా అయిదు వేలు ఎందుకిస్తున్నాం గమ్మునుండు అని విసుక్కున్నారు. నాజర్ నీ యిష్టం వచ్చినట్టు పాడు. వేలమంది ముందున్నట్టు పాడు అన్నారు. నాయుడు ముక్క ముక్క దగ్గరుండి రికార్డు చేయించారు. అనుకున్న దానికన్నా వెయ్యి రూపాయలు అదనంగా యిచ్చి, డ్రస్సు యిచ్చి, కథ రికార్డు యిచ్చి పంపారు. మేము విజయవాడ చేరాము. రామకోటి మద్రాసులోనే వున్నాడు. నేను విజయవాడ చేరి లక్ష్మీనరసయ్యతో, వెంకటేశ్వరరావుతో కల్సి కథ చెప్పటం ప్రారంభించాను.

అగ్గిరాముడు సినిమాలో నన్ను నేను చూస్తూ విన్న తర్వాత నేను పాడుతున్న సాయిలు, ప్రాచీన తెలుగు గాయకులు, వీధి భాగవతులు అందె కోటదాసు, బండారు గూడెం దాసుళ్ళు చినసుబ్బన్న, చింతపువ్వు మాణిక్యం, తారాబాయి లాంటి వాళ్ళు పాడుతున్నట్లుగా లేదనిపించింది. ఎరుకుల, యానాది భాగవతులు పాడిన బాణీలకు నాకు చాల తేడా వున్నదనే భావన నాకే కలిగింది. నేను పాడేవే కొన్ని తెలుగు బాణీలను అనుకుంటున్నాను. కథలు లేని రోజుల్లో వీధి భాగవతుల అడ్రసులు కనుక్కొని వాళ్ళ ముసలోళ్ళ దగ్గరకెళ్ళి కీర్తనలు అవి పాడి చాల కాలం నుండి అనురాగ, విరాగ, సరాగ రాగసాయిలు కనుక వీటిని జనాకర్షణీయంగా అదేస్థాయిలో యింకా బాగా ఆలపించేందుకు దారులు చూడమని ప్రాధేయపడుతున్నాను. శ్రీ జంగా సుబ్బదాసు, గుడిపాడు గ్రామంలో భక్తప్రహ్లాద వీధి భాగోతంలో హిరణ్య కశిపుడి పాత్ర కడుతున్నాడని వెళ్ళాను. నాటకం కాగానే వీధి భాగోతం సాయిలు నేర్పమన్నాను. ఆయన నవ్వి "మా వాళ్ళు అబ్బూరి కళలని, డ్రామా రాగాలని ఓఓఅని అంటుంటే, నువ్వేంటి నాయనా మా పాత కళ నేర్చుకుంటానంటావు" అని అన్నాడు.

నేను ఎన్నో సంవత్సరాల క్రితం నేర్చుకున్న శ్రీ అందె కోటదాసు సైరంధ్రి వేషంలో పాడింది, 'చూపరే సుందర బ్రాహ్మణ సుందారవతులార' అనే కీర్తన 'ఎంత మాటడిగితివమ్మా రాజకాంతలకిది మంచి ఘనమౌనమ్మా!' బండారు గూడెం దాసులు 'చంద్ర దాసు' వేషంలో పాడిన 'మూలా నక్షత్రంన చతురోత్తర గండాన, నాలుగోపాదాన, నే జననమైతి' అనే కీర్తనలు పాడాను. నాకీర్తనలు విన్న సుబ్బదాసు కన్నీళ్ళు తుడ్చుకుంటూ, "బాబూ నేను "కోటదాసు" పక్క రాజు వేషం వేశాను. మళ్ళీ అంత సౌలభ్యం అంతుపట్టక అంత శ్రుతి పక్వత లేకపోయింది. ఆ మహానుభావుని సాయలు వినగలిగాను. నేనింత వరకు కొంచెం తేడా పాడాతో పాడగలిగాననే అనుకుంటున్నాను. ఆ పై నాకు తెలియదు" అన్నాడు సుబ్బదాసు. బాగాపాడానని మెచ్చుకున్నాడు. కట్టూరు పాలెంలో నా గురువు దాసును కలిశాను. కాకినాడ కథ కెళ్ళాను. ఆకుల నరసింహారావు మంచి హార్మోనిష్టు, గాయకులు, బాలగంధర్వ బాణి చాలా బాగా అనుకరిస్తారని తెలిసింది. నేను వెళ్ళి నా బుర్రకథ రగడలకు కీర్తనలకు సంబంధించి వీధి భాగవత సాయిలను వినిపించి వీటి అభివృద్ధికి మార్గం చూపమన్నాను. ఈ సంగీతం చెడకుండా సాయిల్లో నేర్పుతానంటే వుంటానని ప్రాధేయపడ్డాను. "నాజరుగారూ యీ బాణీల సాయిలు ఆరోహణ, అవరోహణ తోముతూ పట్లు నేర్పేవాళ్ళిక్కడ కాదు. ఉస్తాద్ అబ్దుల్, కరీంఖాన్, బిస్మిల్లా షహనాయి, బాలగంధర్వ, ఓంకారనాథ్, ఠాగూర్‌ల పాత రికార్డులను తెచ్చుకొని విను. నీ అభిప్రాయాలను నాకు తెలియచెయ్" అని నరసింహారావు అన్నాడు. కలకత్తా ఆ రోజుల్లో

నేను ఆంధ్రసంఘం వారి ఆహ్వానంపై కథ చెప్పడానికి వెళ్ళాను. ప్రాచీన సంగీతం కరీంఖాన్ యిరవై రెండు రికార్డులను పట్టుకొచ్చాను. బిస్మిల్లా, షహనాయి, ఓంకార్‌నాథ్ రికార్డులు తెప్పించాను.

ఇంతలో 'భలే బావ' సినిమాలో కథ చెప్పేందుకు ఆహ్వానం వచ్చింది. లక్ష్మీనరసయ్యను తీసుకుని మద్రాసులో రామకోటిని కలుపుకుని "భలేబావ" సినిమాలో "జానకీ వనవాసం" బుర్రకథ రాశా. అందె కోటదాసు, చిన్నసుబ్బన్న, పెద్దసుబ్బన్న, బండారుగూడెం దాసులు, తారాబాయి, పద్మాబాయి, చింతపూవు మాణిక్యం, చిందుభాగవతుల బాణీలను, అబ్దుల్ కరీం, బిస్మిల్లా ఖాన్, ఓంకార్‌నాథ్ సంగీత విద్వాంసుల రాగసాయిలను కలగాపులగం చేసి "బుర్రకథ" బాణీలు, రాగసాయిలు కొంచెం కొత్తదనంగా వుండేందుకు కృషి చేస్తున్నారు. రామకోటి, లక్ష్మీనరసయ్యలతోనే యీ కొత్త పోకడలతో సాయిలలో రికార్డు చేసి తెరపైన ఆడి లక్ష్మీనరసయ్య నేను విజయవాడ చేరాము.

"ఆంధ్రదర్శిని" అనే చారిత్రాత్మక కళాగ్రంథంలో 1954లో ప్రాచీన జానపద కళారూపమైన బుర్రకథకు జీవం పోశారు శ్రీనాజర్. ఆయనే కథకుని వేషం, దుస్తులు, రంగులు, నిర్ణయాలు నాజరు సొంతమని యిప్పుడు బుర్రకథ చెప్పడంలో నాజరు యుగం నడుస్తుందని 'శ్రీనివాస చక్రవర్తి' గారు రాశారు. ప్రభుత్వ సంగీత నాటక అకాడమీ ఆధ్వర్యంలో మళ్ళీ కలకత్తా ఆహ్వానం వచ్చింది. వెంకటేశ్వరరావు, నేను, లక్ష్మీనరసయ్య బయలు దేరుతున్నాం. ఢిల్లీ రేడియో స్టేషన్లో జానపద కళాఛాయల్లో నాకు స్పెషల్ ప్రోగ్రాం వుందని ఆ ప్రోగ్రాం చూసుకుని అటునుండి కలకత్తా వస్తానన్నాడు లక్ష్మీనరసయ్య. జానపద కళాఛాయలైతే నీవేమి చేయగలవు. ప్రత్యేకంగా నీవే కళారూపంను, కనీసం పాటలైనా పాడలేవు కదా ఎవరి ప్రక్కనైనా బుర్రకథకు వంతగా వెళ్ళుతున్నావా అలా వెళ్ళకు అన్నాను. అదేంకాదు నాజర్ అంటూ ఏదో ఓ అల్లిక అల్లి నన్ను బుకాయించి ఢిల్లీ వెళ్ళాడు. నేను వెంకటేశ్వరరావు కలకత్తాలో దిగి పెట్టెలు దించుతుంటే వొక పెట్టెలో ఢక్కీ లేదు. ఢక్కీ యేమయిందని వెంకటేశ్వరరావుని అడిగాను. లక్ష్మీనరసయ్య తీసుకెళ్ళాడు అని చెప్పాడు. ఢిల్లీలో లక్ష్మీనరసయ్య యేం చెప్పాడో తెలియదు. అనుకున్న ప్రకారం కలకత్తా కథలన్నీ పూర్తి చేసి విజయవాడ వచ్చాం. తరువాత వొకసారి చల్లపల్లి కథకి వెళ్ళాం. రంగులు వేసుకుంటుండగా ఓ కుర్రాడు రేడియో వారు ముద్రించే 'వాణి' అనే పత్రికను తీసుకొచ్చి అట్టమీదున్న బొమ్మను నాకు చూపిస్తూ నాజరుగారూ విజయవాడ నాజరు బృందం అని వున్నది. మధ్య నున్నది మీరేనా అని ఆ బొమ్మలను చూపాడు. ఆ బొమ్మల మధ్యన ప్రయాగ నర్సింహశాస్త్రి, రెండు వైపులా లక్ష్మీనరసయ్య, మాచినేని వెంకటేశ్వరరావు వున్న ఫొటో క్రింద విజయవాడ నాజరు బృందం అని వుంది. ఆ

కుర్రాడిని అడిగి ఆ పేపరు తీసుకుని తంబుర పెట్టెలో వేశాను. నా గుండెల్లో బరువుగా, దిగులుగా దడదడగా వుంది. కథ సాగలేదు. ఎట్లాగో కథ పూర్తిచేసి పడుకున్నాం. నిద్రపట్టలేదు నాకు. ఆ రాత్రి నాలో నేను ఏడ్చాను. బాధపడినాను. అంతకు ముందు లక్ష్మీనరసయ్య చేసిన అవక తవక పనులన్నీ గుర్తుకొచ్చాయి నాకు. పెండ్లికని నాకు చెప్పకుండా, దళసభ్యులకు తెలియకుండా మిత్రుని వద్ద ఆరువందల రూపాయలు అప్పుతెచ్చాడు. దళం తీర్చిందా బాకీ, నా భార్య మెడలో నగలన్నీ అమ్మి ఆ డబ్బులన్నీ యిచ్చి జక్కంపూడిలో మాగాణి చేను కొనమన్నా, కొని తన భార్యపేర రిజిష్టరు చేయించాడు. మళ్ళీ 'భలేబావ' సిన్మాకి వెళ్ళి వచ్చి మరో చేనుకొని అది నా పేర రాయించాడు. యిట్లా యేవేవో తలంపు కొస్తున్నవి నాకు. నిద్రపట్టక లక్ష్మీనరసయ్యను అడిగాను. ఏమిటీ ఫొటో వ్యవహారం అని. ఆకుకు అందకుండా పోకకు పొందకుండా సమాధానం చెప్పాడు.

విజయవాడ రాగానే నాకు తెల్సిందేమిటంటే అప్పటికి ప్రయాగ రేడియో స్టేషన్లో పర్మినెంటు జానపద కళాకారులకు డైరెక్టరు కాదని ఢిల్లీ నుండి విజయవాడకు, హైదరాబాదుకు ఆర్డర్లు వచ్చాయి. నాజరు బుర్రకథ బృందాన్ని ఢిల్లీ పంపమని.

ప్రయాగ నరసింహ శాస్త్రి తనే నాజరు అవతారమెత్తి నాజరు బృందంగా ఢిల్లీ వెళ్ళాడు. మాచినేనిని, లక్ష్మీనరసయ్యను బతిమాలి పట్టుబట్టాడు. నాకీ వుద్యోగంవస్తే మీ యిద్దరికీ వుద్యోగాలు నేనిప్పిస్తానని నసపెట్టి తీసుకెళ్ళాడు. అదీ సంగతి. లక్ష్మీనరసయ్య యింత ద్రోహం చేస్తాడని అనుకోలా.

"లక్ష్మీనరసయ్యా నీతో నేను కల్సి వుండలేను. తనవారు లేనిచోట, అనుమానమున్న చోట వుండరాదన్నారు పెద్దలు. పదివేలిచ్చి 'నాజరు' గొంతు పోయేట్టు చేయమంటే చేస్తావనే భయం కలిగింది. కనుక మనం మంచిగానే ఎవరి బ్రతుకు వాళ్ళు బ్రతుకుదాము నేను గుంటూరు వెళుతున్నాను" అన్నాను. ఏమీ అనలేక తలవంచి నిల్చున్నాడు.

"1949 నుంచి 1958 వరకు నాజర్ బుర్రకథ దళంలో నీవు పనిచేసినందుకు యాభై సెంట్లు మెట్ట, రెండెకరాల మాగాణి కొనుక్కున్నావు. నిన్ను అమితంగా ప్రేమించే అత్తమామలు, సరస్వతీ సమానురాలైన యిల్లాలు అమిరింది. రేపో మాపో పర్మినెంటు రేడియో ఆర్టిస్టు పదవి రానున్నది. నీకు నాజరు బృందం ఏ అన్యాయం చేయలేదు. సెలవివ్వు" అన్నాను. నాకు కళ్ళల్లో నీళ్ళు తిరిగి తలవంచుకొని భార్య భర్తలం ఇద్దరం యింటికి చేరాము.

స్నేహితులు ప్రేక్షకులు నరసయ్యగారు మీ నుండి ఎందుకు చీలిపోయారు అని అడిగితే నిజం చెప్పలేక పోయాను. అలా చెప్పక పోయేప్పటికి నేనే తీసేశాననే అనుమానాలు బయలుదేరాయి. నిజం చెప్పక తప్పలేదు. గుంటూరు పూరి గుడెసెలో బొక్కెడు మెతుకులు

తిని, ముసుగు తన్ని పడుకున్నాను. రాత్రి పట్టిన వాన కురుస్తూనే వుంది. వినాయక చవితి కథల కోసం యెదురు చూస్తున్నాను. నాజర్‌దేముంది. మంచి పుగాకు చుట్టలు చుట్టి యిస్తే చాలు. కట్నం మాటెత్తడు. కథ రోజు మంచి గుడ్ల కోడిని కోస్తానంటే అల్లంత పొద్దుండగానే వస్తానంటాడు అని జనం అనుకుంటారని నాకు తెలుసు. కానీ పెత్తనం లక్ష్మీనరసయ్యదని అతడు కొరకరాని కొయ్య అని నవ్వుకుంటూ కథల కొచ్చే వాళ్ళు ప్రజలు. నాకు వొకటే యావ పట్టుకుంది నాకే రేడియో వుద్యోగం వస్తే ఆ అజమాయిషీ అంతా తనదే కదా నా మనసెరిగి, నా ప్రవర్తన తెలిసుండీ నాకీ నష్టం, కష్టం ఎందుకు కలిగించాడు లక్ష్మీనరసయ్య, దళం పరువు ప్రతిష్ఠలకు భంగం ఎందుకు కలిగించాడు. కేవలం వుద్యోగం ఆశతో అభివృద్ధవుతున్న బుర్రకథ కెందుకు హాని తలపెట్టాడని తెగ దిగులేర్పడింది. లక్ష్మీనరసయ్య అంటే నాకు ఎంతో అభిమానముండేది. వాని కష్టాలు పగవాడికి కూడా రాకూడదనుకొనేవాడిని.

ఏమండీ ఎన్నడూ లేనిది పగలు నిద్రపోతున్నారేమిటీ అని అడిగింది నా సతీమణి నా మొహం మీద ముసుగు తీసి.

“నేను ఏకాకిని” అన్నాను. వెంకటేశ్వరరావు సగం కొత్త, చిన్నబ్బాయి మొత్తంగా కొత్త డక్కీ వరసలే సరిగ్గా కొట్టలేకుండా వున్నాడు అన్నాను. ఎలాగో బండి దొర్లించాలి మీరు దిగులు పడడమేమిటీ, జనం నవ్వుతారు అని ఆమె కూడా నవ్వింది. కథలు చెప్తున్నాను. చిన్నబ్బాయికి రాజకీయలోకం తక్కువ. వాళ్ళ భారం నా మీద పడుతుంది. ఎంత కష్టపడినా కథ రక్తి కట్టటం లేదనే సూచన లొస్తున్నాయి. కథలు బాగున్నాయనిపించుకోవడం కోసం సంగీతం, రాజకీయ, సాంఘికం అన్నీ కలిపి చెప్పాల్సి వస్తుంది. 15% వంతు ఎక్కువ తీసుకుంటున్నాను వంతలిద్దరి అనుమతితో.

కాకినాడ సాయి భజన మండలివారు సన్మానమని బంగారు కల్కి తురాయి తలపాగాకు తగిలిస్తారని బాళ్ళసీతారామస్వామి గారు వక్తలని ఆరోజే ప్రక్కవీధి పందిరిలో ‘నిడదవోలు అచ్యుతరామయ్యగారి’ పోటీ కథ వున్నదని అన్నారు.

నేను యెగిరినదగ్గరే యెగిరి నేను దూకిన దగ్గరే దూకే వాళ్ళేరి. నీళ్ళు దెచ్చి నేను వెనకాడితే డొక్కలో మోచేతితో కుమ్మి గుడ్లురిమే పందెగాడు నాతోటి రామకోటిలేడు. కనీసం లక్ష్మీనరసయ్యలేడు. ఏం చెయ్యాలో అర్థంకాలేదు. అర్ధరాత్రి దుప్పటి లేదు నాకు. వుదయాన్నే లేచి సాయంత్రానికి ‘రాణెలంక విఠల్ బ్రదర్స్’ దగ్గరకెళ్ళాను. వాళ్ళు వేరే ఆలోచన చేస్తున్నారు. తంబురకు తీగలేసి శ్రుతి చేసి శత్రుఘ్నరావుకు, హనుమంతరావుకు ప్రాక్టీసిచ్చాను. కుర్రాళ్ళు మంచి వూపులో కోడె వయసులో వున్నారు. మూడు నాలుగు రోజుల్లోనే బాగా కల్సిపోయారు. కథ పర్వాలేదు. నాక్కాస్త ధైర్యం వచ్చింది.

వెంటనే వాళ్ళను ఆ రోజు ఉదయానికే కాకినాడ రమ్మని నేను తంబుర దక్కీలతో వెళ్ళి కథ బ్రహ్మాండంగా ముగించాను. కల్కి తురాయి తగిలించి కార్లో వూరేగించి 'బుర్రకథ సామ్రాట్' అని బిరుదు యిచ్చారు. అభిమానులు, కళాకారులు వెండి గ్లాసులు, కప్పులు బహుమతులుగా యిచ్చినారు.

వర్షాకాలం వచ్చింది. కథల్లేవు. అమ్మ పొగాకు ఫ్యాక్టరీ పని మాని, చీటీలమ్ముతుంది. గుంటూరు వచ్చి పిల్లలను చూస్తున్నది. నా భార్య యింటికి దగ్గరలో వున్న వెంకటేశ్వరరావు పొగాకు కంపెనీకి వెళుతుంది. నేను రాత్రింబవళ్ళు హార్మోనియం పెట్టుకుని కరీం రికార్డులు, బిస్మిల్లా, బాలగంధర్వ రికార్డులు కథలకు పనికి వచ్చే రాగసాయిలను సాధన చేస్తూ ఏ రగడలో ఏ రసపట్టులో వాటిని అతికించి ఆలపించాలో చూస్తున్నాను.

కంభం నుండి కథ కోసం 'ఈదుల నారాయణరెడ్డి' వచ్చారు. నా కసరత్తు చూశారు. యింతలో చిన్న పిల్ల కెవ్వుమంది. మా అమ్మ వచ్చి "ఓసి నీ పాడుగాను" అంటూ గండుచీమను లాగి బైటకు తీసుకెళ్ళింది. నల్లచింతగింజలు పోసినట్లు గండుచీమలింట్లో తిరుగుతుంటే ఏమిటి పిల్లలు, చీమలు అన్నాడు నారాయణరెడ్డి.

"ఏముంది అక్కడక్కడ కురుస్తుంది. ఊరిబైట కొంప చుట్టూ పొలాలు గండు చీమలొస్తాయి" అన్నాను. కొంప కూడా గట్టిగా కట్టుకోలేదు సంపాదనంతా ఏం చేస్తున్నారని రెడ్డిగారంటే "1943 నుంచి 49 వరకు పార్టీ యిచ్చే ముప్పయి రెండు రూపాయలతో బ్రతికాం అది తెల్సు కదా. ఈ రోజు పార్టీ ముక్కలవ్వడం మూలంగా పార్టీ మాదంటే మాదని నాయకులు గుద్దులాడుకుంటున్నారు వాళ్ళు కళారంగాన్ని గుర్తించే దశలో లేరు కదా" అన్నాను.

తురుమెళ్ళ, కంభంలో కథ చెప్పాలి అని నా పేరు, నా బిరుదులు తీసుకెళ్ళాడు నారాయణరెడ్డి. కంభం కథ కాగానే ఫారెస్టు రేంజరుకు పరిచయం చేసి నాజరుకు యిల్లు లేదు నాకు మన్నెం మీద రెండు లారీలు తాటికడ్డీలు కొట్టిచ్చుకెళ్ళే పర్మిషనిప్పించండి అన్నాడు రెడ్డి. రెండు లారీలు వారం రోజుల్లో వచ్చినాయి. ఆ లారీలోనే టేకుకర్ర దర్వాజాలు, కిటికీలకు సరిపడా ఉన్నాయి. రెడ్డిగారు అక్కడితో ఊరుకోక మా యింటి ముందున్న చౌదరి సున్నం బట్టీ దగ్గరకొచ్చి "చౌదరిగారూ దేశానికి పేరు తెచ్చాడు, గుంటూరుకు కీర్తి తెచ్చాడు నాజరు. ఏదో రెండు లారీల కలప నేను తోలిచ్చాను, యిక మీ సహాయం మీ యిష్టం" అన్నారు.

"సరేనండీ నాజరుగారు మీ దగ్గర డబ్బులున్నప్పుడివ్వండి. మీకు కావాల్సినంత సున్నం తీసుకోండి" అన్నాడు చౌదరి.

కథలు సాగినాయి 'వితల్ బ్రదర్స్' బుర్రకథ ప్రథమ శిష్యులు. 'పాలకొల్లు'లో బ్రహ్మాండంగా సన్మానం చేసి వెండి నటరాజు నిచ్చారు. బ్రదర్సుకు వెండి, బంగారు విగ్రహాలు బహుమతులొచ్చాయి. ఏమిటీయన దేవులాట దినసాధన అని వెంకటేశ్వర రావు, చిన్నబ్బాయి లోలోన నవ్వుకుంటున్నారు.

పెద్దమ్మాయికి ధనుర్వాతం ఆసుపత్రిలో చేర్పించాను. రోజుకి యిరవై, ముప్పయ్, రూపాయలు మందులకు తిరుగుళ్ళకీ అవుతున్నాయి. మూడు నెలలకు తేరుకుంది. డాక్టరొచ్చి "నాజరుగారూ నా ముప్పయ్ రెండు సంవత్సరాల చరిత్రలో ఈ వ్యాధి తగ్గింది మీ అమ్మాయికే" అన్నారు. తిరిగి వారానికోసారి చూపించు కెళ్ళండన్నాడు.

వెంకటేశ్వరరావు పేచీ పెట్టి పోయి మరో దళం పెట్టుకున్నాడు. నేను వెంటనే కాకినాడ 'సలాది భాస్కరరావు'ను తీసుకొచ్చాను. త్వరలోనే రాణించారు. రామకోటిని మరిపించాడన్నారు పెద్దలు. శ్రీకాకుళం జిల్లాలో బుర్రకథకు బాగా యిస్తున్నారు. ఆ ప్రాంతం 'బొబ్బిలికథ' రాయమన్నారు శ్రీ అన్నాబత్తుల నారాయణమూర్తి, భాస్కరరావు. బొబ్బిలి, విజయనగర ప్రాంతంలో తలపండిన వారి సహాయంతో, కొండపాటి వీరయ్య గుండ్రని దస్తూరితో, అన్నాబత్తుల నారాయణమూర్తి గ్రంథానుభవం, లోకానుభవం అందిస్తున్నాడు. ఆరునెలలు కష్టపడి 'బొబ్బిలి యుద్ధం' పూర్తి చేశాను.

యక్షగాన సాయిలు, రగడ, ద్విపదలను తాళ గతుల్లో పాడుకొచ్చాను. ఆ వివరాలు, నడకలు, సాయలు, పాడుకోవచ్చని రాశాను. మొదటి కథ విజయనగరంలో చెప్పదలిచాను. విఘ్నేశ్వర ఉత్సవ వేదికపై నిలిచి మహామహులను మది దలంచి 'విజయనగర వీరబొబ్బిలి చరిత్రమ్ము అనగానే ఏయ్ ఆపు అని జనమంతా లేచి నిల్చుని "ఎవడ్రా యిక్కడ బొబ్బిలి కథ చెప్పేది" అని అరిచారు. వేరే కథ చెప్పమని అడిగారు. నేను "సోదర సోదరీమణులారా కాలి నడకతో తిరిగి ఈ కథాంశాలను ఆరునెలలు సేకరించాను. నేను ఎవ్వరివాడను కాను. దూదేకులవాడను, పింజారీని. ఈ కథ విని తప్పని తోస్తే యిక్కడే చించి మళ్ళారాస్తాను. బాగుందని శెభాష్ అంటే ప్రింటువేస్తాను" అన్నాను. కథ విన్నారు. తుని పరిసర ప్రాంతాల రాజుల బిడ్డలొచ్చారు. వారందరికీ పందిరి వార కుర్చీలు, బెంచీలు వేశారు. మూడు గంటలు అంతా నిశ్శబ్దంగా కథ విన్నారు.

కథలో సంగీత, సాహిత్యాలను,హావ, భావ, నటన, భాస్కరరావు హాస్యం ఎంతో పుష్టిని కలిగించింది. చీమచిటుక్కుమనకుండా విన్నారు. ఈ వూళ్ళో యింత వివరంగా ఎవడూ, ఏ కథా చెప్పలేదన్నారు. కోడి పోరు కాదని, పంటపొలాలు, నీళ్ళకోసం అని మా వాళ్ళు కూడా మాకు చెప్పలేదన్నారు పెద్దలు. వెంగళ రావు పంది వేట మాకు

తెలియదన్నారు. కథ విన్న రాజుల బిడ్డలు వేదికెక్కి ఉభయుల తప్పొప్పులను సాహసంగా వివరించారు. విజయనగరంలో బొబ్బిలి కథ చెప్పిన మొదటి కథకుడన్నారు.

బొబ్బిలి దొరల కోటముందు కథ ఏర్పాటు చేయగా శ్రీపెట్టల నరసింహారావు బంగారు సింహతలాటకమును చేతికి తగిలించారు. నాజర్ యక్షగాన గాయకుడన్నారు కళాకారులు. కిర్లంపూడి దొరలు వెండి కప్పు, తుని మహారాజు బిడ్డలు పెద్ద కప్పు బహుమతిని ఇచ్చారు. కాకినాడ పురప్రముఖులు నా యెడమ చేతికి రెండవ బంగారు సింహతలాటకం, భాస్కర ఘంటాకంకణం, భీమవరం శ్రీ గన్నాబత్తుల రంగరాయ సోదరులు అయిదుగురు కనకాభిషేకం, 'బంగారు గండపెండేరం' తొడిగి సన్మానించారు. ఆ సందర్భంలో కాంగ్రెసు మంత్రిగార్ని ఆహ్వానించగా 'నాజరు' కమ్యూనిస్టు అతనికి మనం సన్మానం చేయట మేమిటన్నారట. అది మా కనవసరం. చచ్చిపోతున్న తెలుగుజాతి కళారూపానికి జీవం పోసినవాడు నాజర్ అని పెద్దలన్నారు. ఆ అభిప్రాయంతో చేస్తాం అని జవ్వాజి లక్ష్మీనాయుడు అన్నారు. కవికులాలంకార, వాఙ్మయోద్ధారక జవ్వాజి గారు ఆనాటి ఎమ్.ఎల్.ఎ.ను సంధానకర్తగా నిర్ణయించారు. పూలరథంపై ఉన్నతాసనంపై నన్ను కూర్చోబెట్టి రథానికి డెబ్బయ్ జతల ఎడ్లని కట్టి, ప్రజలు, ప్రముఖ కళాకారులు, నా శిష్యులు నడుస్తుండగా, షహనాయి, సన్నాయి, బ్యాండు మేళాలతో ఊరేగింపు వేదిక మీదకు వచ్చింది. నేనింతగా ప్రజల అభిమానం చూరగొనుట కెంతైనా నా భార్య ఆదంబియే కారణమనుకొన్నాను. భవనాలపైనా, గోడలమీద, మేడల పైన జనం క్రిక్కిరిసి, కిటకిట లాడుతున్నారు.

'గండపెండేరం కాలికా, చేతికా' అని పెద్దలు గుసగుసలు అని నాకు తెలిసింది. సంగీత విరాట్ శ్రీమహావాది వెంకటప్పయ్య శాస్త్రి, మృదంగం విద్వాన్ తెనాలి వారగు రామానుజం, సూరిగార్లు లోనికొచ్చి నన్ను వొక్కడిని పక్కకు పిల్చి యిలా చెప్పారు. "పెద్దలందరూ వేస్తున్నారు నాకు అర్హత లేకున్నా యీ గండపెండేరం అని చెప్పటం ఈనాటి కళాకారుల తంతు, నీవు అలా చెప్పవద్దు. బుర్రకథ చెప్పటంలో నాకు నేనే సాటి అని చెప్పు, అప్పుడు కాలు బల్లపై పెట్టు నాయుడుగారు కాలికి గండపెండేరం తొడుగుతారు" అన్నారు పెద్దలు.

మల్లంపల్లి సోమశేఖర శర్మ, నిడదవోలు వేంకటరావు. నార్ల వెంకటేశ్వరరావు, అయ్యల సోమయాజులు ఎందరో ప్రముఖ శాస్త్రవేత్తలు, విమర్శకులు, చరిత్రపరిశోధకులు, శిష్యుల వ్యాసాలతో సన్మాన సూచికలను శ్రీ పురాణం సుబ్బారావుగారి పర్యవేక్షణలో ప్రకటించారు. గన్నాబత్తుల సోదరులు ముఖ్యంగా నారాయణ, శ్యాంమూర్తి, పెదతాతగారి సహకారంతో సినీడైరెక్టరు తాతినేని ప్రకాశరావు తన గృహప్రవేశానికి ఆహ్వానించి

వెండికప్పు, సాసర్లు వెయ్యినూట పదహార్లు రొఖ్ఖం చదివించారు. సినీనటి శ్రీమతి లక్ష్మీరాజ్యంగారు తమ తల్లి జ్ఞాపకార్థం మద్రాసులో కథ పెట్టించారు.

సినీగాయకులు పద్మశ్రీ ఘంటసాల వెంకటేశ్వరరావు గార్ని వెయ్యినూటపదహార్లు చదివించమన్నారు. "శ్రీ నాజర్ కమ్మగా ఆడి, పాడి, రాసి నటిస్తున్నారు. ఆయనదంతా సొంతంగా నేర్చుకున్నదే కాక పూర్వజన్మ సుకృతమనీ, బుర్రకథోద్ధరణకు జన్మించిన వ్యక్తిగా నేను భావిస్తున్నాను" అని నా కందించారు.

తింఫారములో ఘంటా కంకణము, గుంటూరులో ముత్యాలహారం, దుగ్గిరాలలో నవరత్నహారము, విజయనగరంలో బంగారు కేయూరము బహుమతులు పొందాను నేను అభిమానించే బుర్రకథను జాతి కళారూపంగా తీర్చిదిద్ది నందుకు. నాకు అవకాశము కలిపించి, నా అభివృద్ధికి తోడ్పడిన కమ్యూనిస్టు పార్టీ రెండుగా చీలింది. నేను లెఫ్ట్ గ్రూప్ వేదికపై కథలు చెప్పేందుకు ప్రయత్నిస్తున్నాను. కారణం మితవాదగ్రూపు తమ వేదికపై కథ పెట్టుటమానింది.

ఇంతలో నగ్జల్బరీ ఉద్యమం శ్రీకాకుళంలో ప్రారంభమైంది. ఆ గ్రూపులను సమర్థిస్తూ ఆ వేదికల మీద కథ చెప్పడం ప్రారంభించాను. దీనితో లెఫ్ట్ గ్రూపు నాజర్ కథ వద్దని ప్రకటించింది. విప్లవ రచయితలు 'కంభం' మహాసభలో కథ పెట్టించి కథ విన్నాక, ఆర్థిక, సాంఘిక, రాజకీయ బోధనావిధానాలు బాగున్నాయని 'శ్రీశ్రీ' ఆధ్వర్యంలో వి.ర.సం సభ్యునిగా చేర్చారు. నాకు అక్కడికి వెళ్ళాక అనిపించింది. వెతికాను అక్కడ నేను వెతికే ఎరుకలులేరు యానాదులు లేరు. నాకు వరస కలిపే కళాకారులు ఎవరూ లేరక్కడ. కొంత కాలానికి నాజర్ నీ ధోరణి మార్చుకోవాలని జాబు వచ్చింది శ్రీ నిఖిలేశ్వర్ పేరుతో. 'అయ్యా మీ సంఘంలో నన్ను చేర్చుకున్నప్పుడు మీరు విన్న కథే నాది. అది వినే చేర్చుకున్నారు. ఆ తర్వాత నా కథలో ఏమార్పులేదు. నేను మార్చుకోవలసింది ఏమీ లేదు. మార్చుకోను నేను' అన్నాను. ఆనాడు చెప్పినా ఇదే చెప్పాను. 'ధనిక రైతులను కమ్యునిస్టులనుకుని వాళ్ళని నాయకులను చేసి కళాకారుడుగా పెద్ద తప్పు చేశానని అనుకున్నాను. ఇప్పుడూ అదే అనుకుంటున్నాను. అట్టడుగు వారు కలిసి సంఘాలై, నాయకులైన నాడే దేశానికి విముక్తి కాని అలాంటి వాళ్ళెవరూ మీలో కనిపించడం లేదు' అని అన్నాను. 'నా నమ్మకం గొప్పది' అన్నాను. నన్ను వి.ర.సం నుండి తొలగిస్తున్నట్లు సర్క్యులర్ వచ్చింది. అప్పుడు అన్ని కమ్యూనిస్టు పార్టీలు తమ వేదికలకు నన్ను పిలవడం మానేశారు.

మళ్ళీ ఏకాకి నయ్యాను. నా కాళ్ళమీద నేనే నిలవాలనేది కనిపిస్తున్నది. నాలో భయం, పట్టుదల పెరిగాయి. కష్టకాలానికెదురునిల్చి, జయించుట నా కలవాటే కనుక

కథలో యింకా ముమ్మరంగా సంగీతాన్ని, సాహిత్యంలో ఆర్థిక, సాంఘిక, రాజకీయ పరిస్థితులను సామాన్యులకు అర్థం అయ్యే రీతిలో రాయాలనే పట్టుదలతో రాస్తూ సాధన చేస్తున్నాను. తానొకటి తలంచిన పరిస్థితులు మరోరీతి యెదురౌతుందన్నట్లు ఉదయాన 'సలాది భాస్కరరావు' వచ్చి గురువుగారు నేను 'రాజకీయ హరికథ' నేర్చుకుని చెప్పాలనుకుంటున్నాను కానీ వంత కాకుండా నేను పెరగాలనుకుంటున్నాను అన్నాడు. ఇద్దరం జాయింటుగా కొన్న ఇళ్ళ స్థలం అమ్మేసి ఆయన వాటాకి వచ్చిన నాలుగువేలిచ్చి యిద్దరు కొడుకులను, భార్యభర్తలను రిక్షా లెక్కించాను. ఇల్లు మధ్యన ఆగి వుంది. పొగాకు కంపెనీ పని మానేశారు అమ్మ, నా భార్య. పిల్లలు చిన్నవాళ్ళు. చిన్నబ్బాయికి బుర్రకథే జీవనాధారం. అతనికి నలుగురు చిన్నపిల్లలు. యెంత ఆలోచించినా యేం చెయ్యాలో తోచటల్లేదు తల దిమ్మెక్కిపోతోంది. వెంకటేశ్వరరావు మళ్ళీ కథ చెప్తానంటున్నాడని చిన్నబ్బాయి చెప్పాడు. బాబూ అన్ని అలవాట్లయినాయి మళ్ళీ బాగుపడతాడులే అని తీసుకొచ్చాడు. వాళ్ళతో కథ చెప్పటం మొదలుపెట్టాను. 'నిలువుదోపిడీ' సినిమాలో కథ వుంది రమ్మని విశ్వేశ్వరరావు ఉత్తరంతో పాటు 500 పంపాడు. నెల రోజులుండి కథ పూర్తి చేసి బుర్రకథ అనుభవం వున్న రాజబాబు చేత తెరమీద ఆడించి వచ్చాను.

ఆ తర్వాత 'పెత్తందార్లు' సినిమాలో 'విశ్వేశ్వరరావు' ప్రోత్సాహంతో నేను తంబుర అందెలు వాయిస్తూ ఘంటసాలతో పాడించాను. నందమూరితో తెరమీద ఆడించాను. అది చూసి ఘంటసాల 'విశ్వేశ్వరరావు గారూ మా యిద్దరి కలయిక మరెప్పుడో' అని ఫోటో తీయమన్నారు. యన్.టి.రామారావుకు నేను నేర్పుతున్న ఫొటో కూడా యిచ్చారు.

'ఢిల్లీ ఆంధ్ర సంఘం' వారి ఆహ్వానంపై వెళ్ళి అనేక ఏరియాలలో 'ఆగ్రా'లో చెప్పి శ్రీ కె.యల్.రావు ఇంజనీరు, క్రొత్త రఘురామయ్య, లక్ష్మీ రఘురాం నుండి ఆతిథ్యాలను బహుమతుల నందుకున్నాను. బొంబాయిలో, అహమ్మదాబాదులో ఆంధ్రుల బహుమతులు, కలకత్తా, టాటానగర్ తెలుగువారి మధ్య బహుమతులు అందుకున్నాను. పాకిస్తాన్, యిండియా కలహకారణంగా బాంబులేసుకుంటున్నారు కనుక ఆపుచేసి గుంటూరు చేరాను.

దక్షిణాది, తంజావూరు, తిరుచునాపల్లి తెలుగు సంఘాల ప్రోత్సాహంతో ఆ ప్రాంతాల్లో చెప్పి నటరాజ విగ్రహాలు, అనేక రజత పతకాలు, బహుమతులు పొందాను. మద్రాసు సినీనటుడు 'శ్రీ నాగభూషణం' గారి కొడుకు పెండ్లికి కథచెప్పడానికి ఒప్పుకున్నాను. కానీ వెంకటేశ్వరరావు తాగి పడుకున్నందున వెళ్ళిపొమ్మనగా చిన్నబ్బాయి నేను పోతున్నానని వెళ్ళిపోయాడు. నేను మళ్ళీ వంటరి వాడినయ్యాను. ఆనాడు నేను రాసే కథలు, పాటలు చక్కగా రాసిపెట్టే కొండిపాటి వీరయ్య కాస్త బుర్రకథ అనుభవం వున్నవాళ్ళను పట్టుకొచ్చాడు.

దామోసుదాసులు, సైదులు, నూరుబాషాలకు మూడునెలల తర్ఫీదిచ్చాను. కొత్త హాస్య, పిట్టకథలు రాసి నేర్పించాను. వాటికి సమాధానాలు నేనే రాసి బట్టీ పెట్టించాను.

కుర్రాళ్ళు మంచి గాత్రులు. ఏ అలవాట్లు లేనివాళ్ళు. మంచి హుషారు గలవాళ్ళు. రేలకాయల్లా కథను లాక్కెళుతున్నారు.

నేను వెనుక బడుతున్నాను వయసు కారణంగా. వంతల దిగులు ప్రస్తుతానికి తీరింది. కథలో రాగాలు, సాయలు ఆలోచిస్తున్నాను. కరీంఖాన్ గానం బుర్రకథ అభివృద్ధికి తోడ్పడేట్టు, తెలుగు గానానికి చాలా దగ్గరగా వున్నట్లున్నది.

ఆ గానం అన్ని స్థాయిలు తాళ యుక్త నడకల్లో నడుపుటకు నా గుండెల్లో దమ్ముచాలుట లేదు. కంఠం యొక్క ధ్వని పటుత్వం చాలలేదు. ఆడుతూ, నటిస్తూ ఆలపించటంతో కొరత పడింది. నాట్యం, శ్రుతి, తాళం వొకరు, దరువు లొకరు, గానం వొకరు పంచుకున్నారనే అభిప్రాయం నాకు కలిగింది. తంబురపై రగడల గతిని, అందెల రవళిని, కాళ్ళతో ఆడడం, కంఠమెత్తి గానం చేయటం, నటించుట నవనాడులు నటిస్తూ కరీంఖాన్ గానాన్ని, తెలుగు అభివృద్ధికి జతపర్చుట నా వయసుకు మించిన భారం అన్పించింది. కొన్ని కొన్ని సాయలు, తాళగతులు, యువకులు మాత్రమే సాధన చేస్తూ కథల్లో ఆలపిస్తున్నారు. రికార్డులన్నీ దాచి వుంచాను. నా బిడ్డలు అయినా అభివృద్ధి చేస్తారనే ఆశతో దాచాను. బుర్రకథ పుట్టుపూర్వోత్తరాలను తెల్సుకోవాలనే ఆలోచనలు మొదలైనవి.

కాకినాడలో నిడదవోలు అచ్యుతరామయ్య అడిగిన మాట గుర్తుకొచ్చింది. "నాజర్ బుర్రకథ, అందెలు, తంబుర, డక్కీలపైనే యెందుకు చెప్పాలి. హార్మోని, తంబురపై యెందుకు చెప్పకూడదన్న" ప్రశ్న గుర్తొచ్చింది. శ్రీనివాస చక్రవర్తి వ్యాసం పత్రికలో చదివాను.

చక్రవర్తి కూచిపూడి, యక్షగానం అన్నీ రాశారు. ఇప్పుడు కూచిపూడి వారు ఆడుతున్న తీరుతెన్నులు 40 ఏళ్ళ నాటి తీరుతెన్నులు చాలా తేడాగా వున్నది. ఏది యక్షగానం అని రాశాను. అసలు 'యక్షగానం' అంటే బుర్రకథే. జాతి కళారూపాలకు జానపద సాహిత్యానికి సంబంధించిన శాస్త్రములు చదివితే నీకే బోధపడుతుందని చెప్పారు.

ప్రస్తుతం హాస్యం చేసే సైదులు వచ్చి నేను కథ చెప్పటానికి వంతలను చూసుకున్నాను అన్నాడు. వంతలతో విసిగిపోతున్న నేను సాంప్రదాయకంగా వెళ్తున్నాను.

కులవృత్తిగా ప్రధాన జీవనాధారంగా కథలు చెప్పుచున్న వొకతెగ జంగాలు యిద్దరు భార్యలు కలిగి వుంటారు. వారు వారి భార్యలనే వంతలుగా తయారుచేసుకుంటారు. యీ వంతల బాధలు పడలేకనే అనుకుంటాను. నేను కూడా ఈ బాధలు పడలేక నా చిన్న భార్య మెడకు డక్కీ తగిలించాను. ఆమెకు సంగీతమన్నా, కళలన్నా ఎంతో ఇష్టం. ఇది నా అదృష్టమే.

ఆమె గాత్రం బానే వుంటుంది. ఈమె చిన్నాన్నలు, అన్న 'బాలమహమ్మదీయ సభ' నాటక కంపెనీ సభ్యులు. కష్టాల్లో భయపడినట్లు కనిపించేది కాదు. నవ్వుతూ ఆనాడు జైలు దగ్గిర కనిపించింది. అలాగే మా అమ్మతో పొలంలో కోతలకు, నాట్లకు కూలికెళ్ళింది. కాఫీ తాగదు, పిల్లల కలవాటు లేదు. నాకు మంచి బట్టలు కొనేది. ఆమె పిల్లలు మామూలు బట్టలే కొనుక్కునేవాళ్ళు. నాకు 63, ఆమెకు 49వ ఏడు కథలు మానుకున్నా. నేనేం చేసినా మా వాళ్ళెవరూ అడ్డుచెప్పేవారు కారు. అందుకే కళనింతగా అభివృద్ధి చేసుకోగలిగాను.

ప్రజల కోసం రాశాను, పాడాను, ఆడాను, డబ్బు లెక్కచేయలేదు. నువ్వు రోజుకొకడిని తయారు చేసుకోగలవు అని నవ్వుతూ అన్నాడు సైదులు. ఏమో నా కోసం వొక దళం కోసం ఆలోచిస్తున్నాను. థామస్ లోగడ తనతో హాస్యం చేసిన సాంబశివరావును తీసుకొస్తే నెల తర్ఫీదిచ్చి మళ్ళీ కథ మొదలెట్టాం. 1972 నుండి 1987 వరకు నా వంతలు. నా కుమారునికి కూడా వంతలు వీళ్ళే.

రామకోటి సినీరంగానికి వెళ్ళింతర్వాత రకరకాల వంతలతో చాలా చిరాకులు, అనుభవాలు గడించాను. థామస్ చాలా మంచివాడు. వొక్కో రోజు రాగసాయల్లో నాతోపాటు ఆనందిస్తూ గుమ్మెట వాద్యం మరిచిపోయేవాడు. ఎన్నో దఫాలు స్టేజి మీద ఆయా ఘట్టాల్లో తన్నులు తిని తప్పు సవరించుకునేవాడు. అన్ని జాతుల రగడలకు, దర్వులకు కుర్రవాళ్ళకు దాసుళ్ళ నుండి వృద్ధులైన చేయితరగ వాయించిన జంగాలు మొదలగు పేరెన్నిక గన్న పిన్న, పెద్దల ద్వారా నేర్పించే తరుణంలో నేను నేర్చుకున్నాను. ఇలా గుమ్మెటల, వాయిదాలనుభవంకలగుట చేత తాళగతులు, నడకలలో కథ యెత్తుగడలు, రాగాలాపనలు, హమ్మింగ్, రాగగతులు, వాటి చుట్టూ కాలాలు తెల్సుకుని సాధన చేసుకున్నాను. కథల్లో రసానుకూల, భావానుకూల రగడ, మూలికలు, రాగసాయలనిపించి, ఆలపించుటతో పాటు కూర్చటంతో పాటు విమర్శలతో పాటు హాస్యం, పిట్టకథలు వాటికి సరిగా ఆర్థిక, సామాజిక, రాజకీయాలకు అభివృద్ధి కరమైన సమాధానాలు నేనే పొందుపరచవలసి వచ్చేది. ఈ రాజకీయ పోర్షన్ రూపొందిస్తే థామస్ స్టేజి మీద వివరించేవాడు.

'ధనానికి దండం, దినానికి దిన గండం, అదేమంటే మరణదండం' వొక సామెత

'ప్రభుత్వ సారా బోరుకొట్టు, స్పిరిట్ కలిపి కొట్టు, తాగినోడు నెల బతికితే వొట్టు'

'హా! భామా! దాళ్వాధామా! రావే నా గండు చీమా!'

'హా! నాథా! పోయెదవా! ఫో యెదవా!'



చూపరే ... బ్రాహ్మణ సుందారవతులార...



నేను 'మా భూమి' నాటకంలో జమీందారు...

'పెళ్ళంటే కళ్ళెం, పెళ్ళాంమంటే పెద్ద బల్లెం, అప్పుడే నీకు పెళ్ళంటరా గొళ్ళెం' ఇలా ఎన్నో ఏర్చి, కూర్చాను, మరియు 'బంధువు పేర బస్సు రూట్లు, భార్యల పేర యిళ్ళ ప్లాట్లు, ఓట్లిచ్చిన మనకు అగచాట్లు' యిలా హాస్యం కలిగించాను.

ప్రేమించి పెళ్ళి చేసుకో, నీకట్నాలన్నీ గుట్టుగా తీసుకో అని పెళ్ళిళ్ళ పిట్టకథ. నేనేది రాసినా మా అమ్మకు, నా భార్యకు వినిపించేవాడిని. అమ్మ కాస్త వుప్పు తక్కువైందిరా అని నవ్వితే మార్చేవాడిని. మా అమ్మపాటలు, మంగళహారతులు, సాహెబ్‌లు పీర్ల పండగకు పాడే షహనాయిలు, మర్మాలు, పాతబాణిలో బాగా పాడేది. సాయంత్రం ఊరేగింపులో వాయించేవి, కలుపుతీస్తూ, గడ్డికోస్తూ మా అమ్మ, 'నానానానానానా' అని జాలిగా విషాదం కలిగించే సాయలో బుర్రకథలలో రగడకు జతపరిచి ఆలపిస్తున్నాను. కరీంఖాన్ శుద్ధ జోగియా, తర్వాత పీర్ల మర్మాలే నాకు ఎక్కువ యింపుగా ఉంటుంది. మా అమ్మకు సంగీత జ్ఞానంలో అనుభవమే కాదు కష్టాల కాపురం ఈదటం చేతనో, దిన పస్తులుంటం చేతనో, నా కోసం ఆలోచించటం వల్లనో కొంచెం రాజకీయ చైతన్యం వుంది.

ఒకరోజు ప్రొద్దుటే మూడురంగుల జెండా కట్టిన టాక్సీ మాయింటి ముందాగింది. మా అమ్మ వీధి వాకిలి ఊడ్చి వంగిన నడుం మీద చేయి ఆన్చి వెనక్కు చూసి తలవంచి రెండడుగులు వేసింది. ఈ జెండా కారు మనయింటి ముందాగింది ఏమిటా అని చూస్తున్న మా అమ్మతో అన్నాను. "బూర్జువా పార్టీలని తిట్టిన మన పార్టీ నాయకులు ఎలక్షన్లో స్వతంత్ర పార్టీని బలపరుస్తున్నారమ్మా. నేను బ్రహ్మానందరెడ్డిని బలపరుస్తూ కథ చెప్పబోతున్నానమ్మా" అనగానే, "నాయనా దినపస్తులున్నావ్, అడుక్కుని విద్య నేర్చుకుని, లాఠీదెబ్బలు తిని, పడరాని పాట్లు పడి, జైలుకెళ్ళి, డబ్బిస్తామని పట్టిస్తే, కనిపిస్తే కాలుస్తామన్నారు, తంబురవేలు నరికేస్తామన్నారు. ఎన్నో గండాలు గడిచాయి. గడ్డపారలే గాలికి పోయాయన్నట్టు గడిపాము.

ఒక్క అమ్మకి, ఒక్క అయ్యకి పుట్టాడు నాజర్ అని అనుకుంటున్నారు జనం. వాళ్ళు చేసిన పని మనం చేయాలా, మరోసారి ఆలోచించుకో" అన్నది.రెడ్డితో ఎవ్వరికీ యిష్టం లేదని బైట కెళ్ళి చెప్పాను. 'ఇంట్లో చెల్లని వెధవా' అని గొణుగుతూ కారుస్టార్టు చేశాడు ఫిరంగిపురం 'యెన్ని రెడ్డి రామిరెడ్డి'. మా అమ్మ కంపెనీ మాని 900 చీటీ అమ్మి, మా భార్య పెరుగమ్మివచ్చేది. మూడు పోర్షన్ల, తొమ్మిది గదుల యిల్లు పూర్తయింది.

పెద్దమ్మాయి పి.యు.సి. ప్యాసయింది. పెండ్లి ప్రయత్నం చేస్తున్నాను. యల్.సి.ఇ. పాసై ఉద్యోగం చేస్తున్న కబీరుతో కట్నం యివ్వలేనన్నాను. మీరు మాకు మామగారు అయితే చాలన్నాడు. నేను పెండ్లి ఖర్చులు, మేళ తాళాల ఖర్చు, బట్టలు భోజనం ఖర్చు కూడా నేనిస్తాను అన్నాను. పిల్లకు 2,116 ఇస్తాన్నాను. అమ్మాయికి 160 గజాల ఇళ్ళ

స్థలం కొని రిజిష్టరు చేయించాను. రెండో అమ్మాయి 10 పాసైయింది. ఆమె పెళ్ళికి లక్ష్మీ నరసయ్య వూళ్ళో పొలం అమ్మి 5 వేల కట్నం యిచ్చి చేశా. మూడవ అమ్మాయి 8 చదివింది. పెద్దల, స్నేహితుల శిష్యుల సహకారం, ప్రజానాట్యమండలిలో నా శిష్యురాలయిన కళాభారతి శ్రీమతి జమున ఇద్దరమ్మాయిలకు చెవుల రింగులు కొనమని 200 పంపింది. మొత్తం మూడువేల అయిదువందల రొఖ్ఖం, పెండ్లి కొడుకు బట్టలు కొనిచ్చారు మిత్రులు, పెద్దలు. నేను 150 గజాల ఇండ్ల స్థలం కొని ఇల్లు కట్టిచ్చి పెండ్లి చేశాను. 'చేతి బంగారు కంకణం' భోజనం ఖర్చుల కమ్మేశాను.

'నాట్యకళా' పత్రికకు బుర్రకథ గురించి వ్రాసి పంపమన్నారు శ్రీనివాస చక్రవర్తిగారు. ఆనాడు పత్రిక ఆయన ఆధ్వర్యంలోనే నడుస్తుంది. "గురువుగారూ నేను రాస్తే తీసివేతలు లేకుండా వేస్తారా" అన్నాను. "అలాగే వేస్తాను" అన్నారు. నాకు తెలిసిన విషయాన్ని రెండు వ్యాసాల్లో రాశాను. రెండూ అచ్చయ్యాయి. సంగీత నాటక అకాడమీ వారు కథకు ఆహ్వానించారు. శ్రీనివాస చక్రవర్తి గారికి 'బొబ్బిలి యుద్ధం' కథ వినిపించాను.

'రెంటపాడు గుడ్డి జంగం, వాల్మీకి ఆశ్రమానికి ముళ్ళల్లో మోడుల్లో నిండుచూలాలు సీతమ్మ నడుస్తూన్నట్లు నటించే వాడు. 'నడువజాలనమ్మా నేనీ కానల, భూమిలోన! అయ్యోయ్యో' అనే పాట నన్నెంతో ఆకర్షించింది. నేను బొబ్బిలి యుద్ధం కథలో 'మల్లమ్మ దేవి' నిండు చూలాలు గర్భవేదన నటిస్తూ 'నిలువజాలనమ్మా అరనిముషమైనా అమ్మమ్మా' అంటూ నటించాను. కథ కాగానే గురువుగారు లోని కొచ్చి, – "నాజర్! కథ మాత్రం బాగానే వుంది, జానపదబాణీలు, రాగసాయలు బానే వున్నాయి. కానీ హాస్యం, రాజకీయం ఎప్పుడూ మూలకథను మరిపించేదిగా వుండకూడదు. సన్నివేశానికి బలాన్ని కూర్చేట్టుగా వుండాలి కదా" అన్నారు. యింకొక విషయం మల్లమ్మ గర్భవేదన కోసం ఆపాట పాడవద్దు అన్నారు. గుడ్డిజంగం సన్నివేశం చెప్తే 'ఒరే యదవా గుడ్డి జంగం కథలు చూలాలి బాధ అంతరార్థం లోతు, అడివి తుప్పల్లో నడిచే బాధ ప్రత్యక్షంగా వుంది. నీవా పాట పాడుతూ నడుస్తున్నప్పుడు మగాళ్ళు నవ్వుతున్నారు, ఆడాళ్ళు తలవంచుకున్నారు. నీకు కనపడలేదా అని చిన్న మొట్టికాయ వేశారు. నేను, రామకోటి నవ్వి వూరుకున్నాం.

జనం నాడి గమనించాను. ఆయన అన్నదాంట్లో నిజం వుండొచ్చు. కాని, నేనట్లా భావించటల్లేదు. ఆనాటి నుంచి నేను పాడటం లేదు. శిష్యులు పాడుతున్నారు.

ప్రభుత్వం అవతరించిన తర్వాత పూలమాలలు, శాలువ, మెమెంటోలతో సన్మానించిన ముఖ్యమంత్రులు 'కాసు బ్రహ్మానందరెడ్డి' మొట్టమొదటివారు. వీరి తర్వాత ఆంధ్ర ముఖ్యమంత్రి హోదాలో శ్రీజలగం వెంగళరావు. తెలుగు మహాసభలో నా కథను వినిపించే అవకాశం, వివిధ దేశాల్లో నివసించే తెలుగు వారి ఆశీస్సులు అందుకొనే అవకాశం

కల్గించక పోయినా సన్మానం చేస్తామన్నారు. కథల వత్తిడిలో రాలేక పోతున్నాను క్షమించమని రాశాను. మూడో దఫా విజయవాడ సమావేశానికి ఆహ్వానించి పూలమాల, శాలువా, తెలుగుమహాసభలకు గుర్తుగా 'తామ్రపత్రంతో' సన్మానించారు.

1978లో రంగస్థలి వృత్తి కళాకారుల మహాసభలో నాశిష్యురాలు శ్రీమతి జమున ఆ సంఘ అధ్యక్షురాలు పూలమాల, శాలువ 116 నగదిచ్చి సన్మానించారు. రాజమండ్రిలో వెంకట్రామ్‌గారు సన్మానించారు. 1979లో ఆంధ్రముఖ్యమంత్రి హోదాలో శ్రీమర్రి చెన్నారెడ్డి ప్రభుత్వ వేదిక 'వెనుకబడిన తరగతుల మహాసభ'లో పూలమాల, శాలువ, మెమెంటోల నిచ్చి సన్మానించారు. 1981లో ఆంధ్ర ముఖ్యమంత్రి శ్రీ టంగుటూరు అంజయ్యగారు సంవత్సరాది శుభ సమయంలో మీకు సన్మానం ఏర్పాటు చేశాం అని రమ్మన్నారు.

'పూజనీయ పేదల బాధలెరిగిన ముఖ్యమంత్రికి కళాభివందనాలు. మహాశయా! మొదటిసారిగా ప్రభుత్వం వేదిక మీద కాహ్వానించి 'శ్రీకాసు' సన్మానించి ఓ చిన్న కానుక యిచ్చారు. అదే మెమెంటో అట. నేను లోనికి రాగానే పేరురాసిస్తానని పట్టుకెళ్ళారు మళ్ళీ యిచ్చిన పాపాన పోలేదు. ఆ తర్వాత 'జలగం' 'చాటంత రేకిచ్చారు' అది 'తామ్రపత్ర'మట. ఆ తర్వాత 'మర్రి' మారేడు చెక్క యిచ్చారు అది మెమెంటో ఆట. అయ్యా! దేశంలో కడుపు నిండకనే కీర్తి చాలా పోగైంది. యిప్పుడు నాకు 61 సంత్సరాలు వచ్చినా యింకా నెలకు రెండు, మూడు కథలు చెప్తే తప్ప యిల్లు గడవదు.

నాకు అయిదుగురు అమ్మాయిలు, యిద్దరు అబ్బాయిలు. కమ్యూనిస్టుగా రహస్య జీవితం అనుభవించి బైటపడినాక పుట్టారు. అందరూ తినేవాళ్ళు, చదువుకునేవాళ్ళే కానీ పావలా సంపాదించేవారు లేరు. ముగ్గురికి పెళ్ళి చేశాను. కనుక సంవత్సరాది పండుగ రోజున గొర్రెపాటి వెంకటసుబ్బయ్యగారి సన్మాన సభ బళ్ళారి వద్ద పల్లెలో కథ చెప్పేందుకు అంగీకరించి అడ్వాన్సు తీసుకున్నాను. తమకు తెలియనిది లేదు. 'నాజర్ కథంటే వేలాది ప్రజలొస్తారు. నేను కథకు వెళ్ళకపోతే నాకు నా కథ పెట్టించిన వారికి శాపనార్థాలు తప్పవు. కనుక నాకు అవకాశం వచ్చినప్పుడు వస్తాను. నన్ను క్షమించండి' అని జాబు రాసుకున్నాను. తర్వాత వెళ్ళి సన్మానం అందుకున్నాను. సన్మానపత్రం, శాలువా తెచ్చుకుని ఫ్రేములో బిగించి గోడకు తగిలించాను. 1981లో సినీనటి జమున ఒక జాబు రాసింది. 'గురువుగారూ నేను 'ఆంధ్రప్రదేశ్ నాటకం అకాడమి అధ్యక్షురాలయ్యాను, తమరు అకాడమి సభ్యత్వం తీసుకొని తమ అమూల్యమైన అనుభవాలనందివ్వాలని కోరుతున్నాను' అని. ఆ అమ్మాయి 'మా భూమి'లో పాత్ర ధరించింది. 'అమ్మా నీ సిన్సియారిటీ నీ మంచితనంతో నన్ను ఆహ్వానిస్తున్నావు. కానీ నాకు దానిమీద ఏ మాత్రం ఆసక్తి లేదు నేను సభ్యత్వం తీసుకోను' అని రాశాను.

1981 మార్చి 17న 'సాంస్కృతిక శాఖామాత్యులు'గా 'భాట్టం శ్రీరామమూర్తి, నాజర్‌గారూ మిమ్మల్ని అకాడమీ సభ్యులుగా నేను సూచించాను, అందుకని వచ్చి మహాసభలో పాల్గొనాలని కోరగానే సభలో పాల్గొన్నాను. అకాడమీ సభ్యుడనయ్యాను. 1982 'కేంద్ర సంగీత నాటక అకాడమీ' అధ్యక్షురాలు కమలాదేవి ఛటోపాధ్యాయ గారి సమక్షంలో వివిధ కళాకారులు, గాయకులతో నిండి వుంది 'రవీంద్ర భారతి'. వేదిక మీద జమునగారు నన్ను విశిష్ట సభ్యత్వము, 5వేల నగదు, పండిత రత్నకంబళితో సన్మానించారు. ఆ సభలో నా కథ వినిపించాను.

1983లో టి. అంజయ్యగారు నెలకు 150 రూ. వృద్ధ కళాకారుల జీవన భృతిని కల్పించారు. తరవాత 1992లో ఆపేశారు. అకాడమీ ఆధ్వర్యంలో ఆరు దళాలకు బుర్రకథ ప్రాక్టీసు యివ్వాలనుకున్నారు. సాంస్కృతిక మంత్రులు అందుకు ఖర్చులకు గాను 10వేల రూ. నాకిచ్చేటట్లు తీర్మానించారు. నెల, పదిహేను రోజులకు ఒక్కో దళానికి 450 ఇవ్వమన్నారు. జీవనభృతి, బీదవారైన నా శిష్యులు వండుకుతింటూ కథ నేర్చుకుంటున్నారు. అడుగులు నేర్పేందుకు శ్రీపితాని వీరభద్రరావుగారికి, అలానే గుమ్మెట దరువులు నేర్పేందుకు శ్రీథామస్ గార్కి ఇద్దరికి నెలకు వెయ్యి జీతంగా ఆరుదళాలకు డ్రస్సులు ఇంటి అద్దెలకు గాను మొత్తం పదివేల రూపాయలు శాంక్షను చేయించారు జమునగారు. నాయింట్లోనే రూం కేటాయించాను. స్కూలు నడిపించాను.

నేను కథ, వీరభద్రరావు డాన్సు, థామస్ గుమ్మెట దరువులు శ్రమ అనుకోకుండా నేర్పాము. ఆరు దళాలను రవీంద్రభారతిలో మంత్రుల, కళాకారుల, ప్రజల సమక్షంలో ప్రదర్శన లిప్పించాను. ప్రజలు ప్రేక్షకులు పెద్దలు యింత తొందరలో ఆరుదళాలను యింత బాగా తయారుచేశామని మాముగ్గురికి దళ సభ్యులకు ప్రశంసా పత్రాలనిచ్చారు.

కొందరికి నేను కోరి మైకు సెట్లిప్పించ్చాను. దళాలకు కుట్టించిన డ్రస్సులను వాళ్ళకే యిప్పించాను. దళ సభ్యులు బీదవారు.

1984 ఆంధ్ర కాంగ్రెస్ ఏర్పాటు చేసిన సాంస్కృతికోత్సవాలలో ఆంధ్రప్రదేశ్ గవర్నర్ శ్రీ రాంలాల్ గారు పూలమాల, శాలువ, నాట్యధర్మ కంచువిగ్రహాలిచ్చి సన్మానించారు.

నేనా రోజు సిన్మాకి వెళ్ళాను. సాయంత్రం ఎస్సయ్, ఆర్.డి.ఓ. కలెక్టరు మిలటరీ పోలీసు వ్యానులో యింటి ముందు దిగారు. వాళ్ళను చూడగానే పాతరోజుల్లో కోర్టులు, జైళ్ళు గుర్తుకొచ్చి ఇప్పుడు నా సతి భయపడుతున్నది. యింతలో ఓ పోలీసు వచ్చి "ఏరమ్మా! నాజర్ గారు" అనగానే ఆమెకు ప్రాణాలు ఆకాశానికెగిరి హీనస్వరంతో హరహరమహల్‌కు సిన్మాకెళ్ళారని చెప్పిందట.

సినిమా నుండి బైటకు రాగానే గేటులోనే నన్ను ఆర్.డి.ఓ జవాను పట్టుకున్నారు.



నేను వెనకాడితే డొక్కలో
మోచేతితో కుమ్మి గుద్దులిమే
పందెగాడు నాతోటి రామకోటి...

పూలరథంపై ఉన్నతాసనంపై నన్ను కూర్చోబెట్టి...



...రథానికి డెబ్బయి జతల ఎడ్లని కట్టి ప్రజలు, ప్రముఖ కళాకారులు, నా శిష్యులు నడుస్తూండగా...



తంబుర అందెలు వాయిస్తూ ఘంటసాలతో పాడించాను.



ఎన్.టి.రామారావుకు నేను నేర్పుతున్న ఫోటో కూడా ఇచ్చారు...



'గండపెండేరం కాలికా చేతికా' అని పెద్దల గుసగుసలు నాకు తెలిసింది...



పెద్ద భార్య కాశీంబీ

నాజరుగారూ మిమ్ములను అయ్యగారు రమ్మంటున్నారు అని సినిమా హాలులోనే ప్రత్యేక రూంలోకి తీసుకొచ్చారు. అక్కడున్న వారికి నమస్కరించాను. నాకేం అర్థం కాక భయంగా నిల్చున్నాను. కలెక్టరుగారు మెల్లగా 'నాజరుగారూ' కేంద్ర ప్రభుత్వం మీకు 'పద్మశ్రీ' అవార్డివ్వడానికి నిర్ణయించింది తీసుకుంటారా అనగానే 'ఎందుకు తీసుకోను' అన్నాను. లేకుంటే అరెస్టు చేస్తారేమో అనిపించింది. యిప్పుడే బైటపెట్టకండి. యింకా గెజిట్ ప్రకటనివ్వలేదు అన్నారు అధికార్లు. హమ్మయ్య అనుకున్నాను.

1986లో రిపబ్లిక్ డే నాడు కేంద్ర ప్రభుత్వం 'పద్మశ్రీ' అవార్డు ప్రకటించి భారత ప్రధాని 'శ్రీరాజీవ్‌గాంధి' 'శ్రీ పి.వి. నరసింహారావు' గార్ల సమక్షంలో, అనేక మంది పెద్దలు, ప్రముఖ కళాకారులు, కవుల సమక్షంలో వీడియో, ఫొటోగ్రాఫర్ల క్లిక్‌లు మ్రోగుచుండగా ప్రేక్షకుల, పెద్దల కరతాళధ్వనులు మిన్నుమిట్టు చుండగా రాష్ట్రపతిభవన వేదికపై రాష్ట్రపతి జ్ఞాని జైల్‌సింగ్ పద్మశ్రీ అవార్డు గుర్తును నా గుండెపై అలంకరించారు. పద్మశ్రీ అవార్డు ప్రకటనవిన్న నా రాజకీయ గురువుల్లో వొకరైన త్యాగి, ఆదర్శ దేశభక్తుడు, శ్రీ వావిలాల గోపాల క్రిష్ణయ్య గారు పూలమాల నలంకరించి తన పవిత్ర హృదయానికి హత్తుకున్నారు. ఇది మీ నలుబది సంవత్సరాల అమూల్య ఆశీర్వచన ప్రభావము, మీరిచ్చిన రాజకీయ పరిజ్ఞానములకు గుర్తుగా భావిస్తున్నాను అన్నాను. నవ్వారాయన. ఆంధ్రముఖ్యమంత్రి శ్రీ నందమూరి తారక రామారావు శాలువా, పూలమాల, వెయ్యినూటపదహార్లు యిచ్చి రవీంద్రభారతిలో కవుల, కళాకారుల, పెద్దల, ఎమ్.ఎల్.ఎ.ల సమక్షంలో ఘనంగా సన్మానించారు. నా జీవితం గురించి రాసిన పత్రికను నా ఫొటోని ప్రకటించి పంచినారు. పద్మశ్రీ అవార్డు ప్రకటన రేడియోల్లో, పత్రికల్లో విన్న ప్రజలు రాష్ట్ర, రాష్ట్రేతరాల్లో వున్న వాళ్ళతో సహా మొత్తం నలభై సన్మానసభల్లో శాలువలు, పూలమాలలు, ధనంతో సత్కరించారు. యిందులో ఆరు కాలేజీలు, వొక యూనివర్శిటీ పదునాలుగురు కవుల, కళాకారుల సదస్సులోను, ఎనిమిది కార్మిక రైతు ప్రముఖులు, ఎమ్మెల్యేల చేతను పండుగల్లో, క్లబ్బుల్లో జరిగినవి, ఎనిమిది. వీటిలో మా దంపతులను పూలరథాలపైన, చిన్నకారులో వూరేగించినవి మూడు.

జమున అధ్యక్షతన ప్రజలు, డాక్టర్లు, శ్రీచెలికాని స్టాలిన్ బాబు దంపతులు, రామచంద్రాపురం వాస్తవ్యులు, దాక్షారామంలోనూ, శ్రీపితాని వీరభద్రరావు దంపతులు 'ఆర్యాపీటం'లోను, శ్రీలాలుగు అప్పాజీగారి ఆధ్వర్యంలో జరిగిన రాజమండ్రి సభలు గొప్పవి.

1986లో ఎన్నో సన్మానసభల్లో ప్రజల మన్ననలందుకుంటూ హైదరాబాదు ప్రజానాట్యమండలి సభలో కథ చెప్పి మరునాడు నిజాం కళాశాల ఆడిటోరియంలో కథ చెప్పి అప్పటికప్పుడే బస్సులో గుంటూరు వచ్చాను.

ఉదయం నిద్రలేవగానే మూత్రం బంద్దైనది. పొట్ట వుబ్బుకొస్తున్నది. చంపేస్తుందేమో అని భయపడుతూ ప్రభుత్వ ఆసుపత్రిలో పని చేస్తున్న డాక్టరు గారి వద్దకెళ్ళాను. ఆయన ఆపరేషన్‌కు 30వేలు అవుతుందన్నారు. కానీ తాత్కాలికంగా యూరిన్ వచ్చేట్లు చేశారు. నా యింట్లో ఎవ్వరికే జబ్బు చేసినా సొంత డాక్టరుగా ఎంతో ఆప్యాయంగా చూసే పెద్దల పెన్నిధని పొగుడుతున్న ఎమ్.ఎల్.ఎ. యైన కాసరనేని సదాశివరావుగారికి గవర్నమెంటు డాక్టరు గారన్న మాటలు చెప్పాను.

ఏం చేయాలన్నాను. ఆయన నీవేమి చేయవద్దు 12వ తారీకు వరకు ఆగమన్నారు. అంత డబ్బు నీకెక్కడిదయా అని నవ్వారు. అసెంబ్లీ సమావేశం నుండి రాగానే డిసెంబరు 12వ తేదీన ఆపరేషన్ చేశారు. రెండు నెల్ల తర్వాత యింటికొచ్చాను. కానీ ఆ రాత్రికే చలితో జ్వరం వచ్చింది. మళ్ళీ హాస్పటల్‌కి వెళ్ళాను. నా చిన్న భార్య నాతో యీ బాధలన్నీ పడుతూ నా కంటికి రెప్పలా కాపాడుతుంది. నెలరోజులకు యింటికెళ్ళవచ్చన్నారు. డబ్బుగా నేనేమీ యివ్వలేదు. ఆయన మాకు బిల్లు యివ్వలేదు. నా సతి 500 బల్లమీద వుంచి దండం పెట్టి నిలబడింది. ఎందుకిది మిమ్మల్ని డబ్బులెవరడిగారు అన్నారాయన. లేదండి యిది మీ ఫీజు కాదు. మంచానికి అద్దె అని నేనాయన జేబులో పెట్టి యిద్దరం నమస్కరించి యింటికివచ్చాం.

1986 నుండి నేను ఆయన గారి పేషెంటుగానే జీవిస్తున్నాను. అప్పటికి 19, 20 ఏండ్ల నాటి నుండి నా జాతి విజ్ఞానం యక్షగానం అనే 'తెలుగు జాతి విజ్ఞాన చరిత్ర' అనే గ్రంథాన్ని పూర్తి చేయాలనే తపన, పట్టుదలతో అందుకు సంబంధించిన గ్రంథాలు పరిశోధించడం, వ్రాయడం ఎక్కువ చేశాను. 'యూరిన్' ఆగుట లేదు. నిలబడినా, వంగినా నాకు తెలియకనే కట్టు పంచె తడుస్తున్నది. మేలుకొని తిరిగినంత సేపు ప్లాస్టిక్ సంచిని, పడుకున్నప్పుడు గోచీని వాడుతున్నాను. ఏ కారణమో తెలియదు గాని 1989 నుండి పుంసకత్వం కూడా పోయినది. ఇపుడు నా భార్య లిద్దరు నన్ను తమ భర్తగా చూసే కన్నా బిడ్డగా యెంచి, పెంచుతున్నారనుకున్నాను.

నా బుర్రకథ రగడల గురించి సంగీత, సాహిత్యరీతుల గూర్చి ఎన్నో వివరాలని నేను బుర్రకథకు చేసిన కృషిని గూర్చి మరెన్నో విషయాలు చెప్పించుకుని టేపు చేసుకుని శ్రీ కె.వి. హనుమంతరావు గారు రేడియోలో విన్పించినారు.

ఆంధ్రజ్యోతి, ఉదయం, ఆంధ్రపత్రిక, ఈనాడు, పేపర్లు ప్రముఖంగా విశేషంగా శీర్షికలు, సంపుటాలు, ముద్రించి బుర్రకథ విశిష్టత గురించి నేను చేసిన పనుల గురించి వ్యాసాలు ప్రకటించారు. 1986లో ఉపరాష్ట్రపతి శ్రీ ఆర్. వెంకట్రామన్ 'కేంద్ర సంగీత నాటక అకాడమీ' ప్రకటించిన 10వేల నగదు, పూలమాల, శాలువాతో సన్మానించారు.

1987 నూతన సంవత్సర శుభాకాంక్షలు తెలుపుతూ ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ ఎన్.టి.ఆర్. వ్యక్తిగతంగా సొంత డబ్బు అయిదువేల నగదు, ఆంధ్రముఖ్యమంత్రిగా పండితరత్న కంబళితో సన్మానించారు. నాటి ఆంధ్ర గవర్నర్ శ్రీమతి కుముద్‌బెన్ జోషిగారి ద్వారా సన్మానించారు. వైద్య శిఖామణి శ్రీ పెనుగొండ శ్రీ షేక్‌మీర్జాన్ గారు ఏర్పాటు చేసిన ఘన సన్మానం అందుకున్నాను. రాజారావు స్మారక సభలో ఒంగోలు డాక్టర్లు, కళాకారుల సన్మానం అందుకున్నాను.

అప్పుడు నేనిలా చెప్పుకున్నాను.

“సోది యానాది, ఎరుకుల, మాదిగ, చిందు, డక్కలి యిలాంటి ప్రాచీన జాతి కళావంశీయులారా! నాపైన మీరుంచిన అమూల్యమైన ప్రజల యొక్క కళల వేషభాషలు, రగడల పట్లు, శ్రుతిలయ సాయలు, గానాలు, నాట్యనడకలు, హావభావ నటనాలు, దరువులు, మున్నగు బుర్రకథ సంప్రదాయ వృద్ధ కృషిలో నా శక్తికి మించిన కృషి చేసినందుకు గుర్తులుగా ప్రజలు ప్రభుత్వాలు ప్రసాదించిన బహుమతులు నా కృషికి, నా కష్టానికి ఫలితాలు. మీకు మారుగా నేను స్వీకరించానని సవినయంగా మనవి చేసుకుంటున్నానని విన్నవించుకుంటున్నాను. తెలుగు జానపద కళాత్మక హృదయులారా బుర్రకథ నా ఇంట పుట్టిన కళకాదు.

నా గురువులు షహనాయ్, నౌబత్, వాద్య కళారాధకులు. మీ నుండి స్వీకరించిన జాతి జ్ఞాన కళారూపాన్ని నా శక్తికి మించి సాకి పెద్దచేసి ఉన్నత వేదిక లెక్కించి బంగారు సింహతలాటకాలు, గండపెండేరాలు, కేయూర రత్న మణిహారాలు ధరింప చేశాను. ఆంధ్ర మంత్రుల చేత సన్మానాలు చేయించాను. కేంద్ర ప్రభుత్వం చేత ‘పద్మశ్రీ’ అవార్డు లిప్పించాను.

మీరు నా కందించిన కళకు న్యాయం చేకూర్చాననుకుంటున్నాను. నేను వచ్చిన పని అయినది. ఇంక నిశ్చింతగా నిద్రపోతాను...”





అభిమానులు మా బాజీ విగ్రహం చేయించి...



మా బాజీతో ...

# మా బాజీ

**మా** ఇంటి ముందు పెడతామన్నారు అభిమానులు మా బాజీ విగ్రహం చెయ్యించి. మా మనిషే గాని అయ్యా కథ మా కొక్కరికే చెప్పలేదయ్యా అన్నా. అందుకని పొన్నెకల్లులో పెట్టారు. మా బాజీ ది పొన్నెకల్లు.

మాది గారపాడు. మా నాన్న పేరు మీరాసాహెబ్. యంత్రాలు, మంత్రాలు పెట్టేవాడు.

ఆ సంపాదన మీదే మేమంతా బతికేవాళ్ళం. మా నాన్నకి రెండు పెళ్ళిళ్ళు. తొలి భార్య చనిపోతే మా అమ్మని చేసుకున్నాడు. మా అమ్మ పేరు అల్లింబీ. మేము నలుగురు అక్క చెల్లెళ్ళం. యిద్దరు అన్నదమ్ములు. నాజరు మా మేనత్త కొడుకు.

మా తాతపేరు అసన్ సాహెబ్. ఆయనకి ఎనిమిది మంది సంతానం. అయిదుగురు అమ్మాయిలు, ముగ్గురు అన్నదమ్ములు. ఆ అయిదుగురు అమ్మాయిలలో మూడో అమ్మాయి బీబాబీ. ఆమె కొడుకు నాజరు.

అన్నదమ్ములలో రెండో వాడు మా నాన్న మీరాసాహెబ్. అంటే నేను, నాజరు మేనత్త మేనమామ బిడ్డలం అన్నమాట.

నాకు చిన్నతనంలోనే తల్లి లేదు.

మా అక్కతో నాజర్ నిఖా అయింది.

మా అక్క పేరు కాశింబీ. ఆ పెళ్ళి చాలా బాగా జరిగింది. ఉర్దూ మేళంతో గుర్రమెక్కి వచ్చాడు మా బాజీ.

మంగలి మేళంతో నిఖా జరిగింది. అది కొన్నాళ్ళ ముచ్చటే అయింది. మా అక్క మళ్ళీ గారపాడు వచ్చేసింది. ఎందుకో ఆ వయసులో నాకు తెలియలేదు. ఆ తర్వాత నాకు తెలిసింది. ఆమె సంసారం చేస్తే కళ్ళు పోతయ్ అని డాక్టరు అన్నాడనీ అందుకని ఆమెని మా బాజీ వదిలేశాడనీ. ఆమె మాపుట్టింట్లోనే వుండేది. బాజీకి మొదటి సంబంధం మా అక్క కాశింబీ.

అప్పటికి నా వయసు పదకొండు సంవత్సరాలు. మా అమ్మ భంగపడి అడిగింది మా బాజీని. అయ్యా నాజరూ మా కాశింబీకి అన్యాయం చెయ్యొద్దు. దాని బతుకు బండలయిపోద్ది. కొన్నాళ్ళు ఆగు, చూడు. దాని జబ్బు తగ్గకపోతుందా, పోనీ తగ్గక పోతే

యిదిగో యింకో నాలుగేళ్ళు పోతే ఈ పిల్ల పెద్దదవుతుంది దాన్ని చేసుకుందువు గాని అంది నన్ను చూపించి. అప్పటికి యింకా నేను చిన్న పిల్లని. యిదా అది బోల్డు చిన్నది అది పెద్ద అయ్యేదెప్పుడు నేను పెళ్ళాడేదెప్పుడు, అది జరిగే పనికాదులే అని మా బాజీ వొప్పుకోలేదు. నన్ను డాక్టరు పెళ్ళాడమన్నారు అని కరాఖండిగా చెప్పి వెళ్ళిపోయాడు.

మా అక్క బాగా యేడ్చింది. మా అమ్మ కళ్ళనీళ్ళు పెట్టుకుని యేడ్చింది. ఆ తరువాత నేను చిన్నగా వుండగానే మా అమ్మ అల్లీంబీ చనిపోయింది. నన్ను మా నాన్నే పెంచాడు.

తరవాత మా బాజీ వేరే పెళ్ళి చేసుకున్నాడు. కానీ ఆమె తాగాడి మీద కాలేసి నీళ్ళు తోడుతూ కాలుజారి నూతిలో పడి చనిపోయింది. మా అక్క కాశింబీ మా యింట్లోనే వుండి పోయింది. ఆమె మా బాజీ చనిపోయిన తరవాత కూడా బతికింది. ఆమెకి చనిపోయేంత వరకు కంటిచూపేం పోలేదు. అర్ధ చూపుతో అలాగే వుంది.

నాకు అప్పుడు పధ్నాలుగేళ్ళు. అమ్మలేదు. మా నాన్న మమ్మలిని బాగా చూసుకునే వాడు. నాకు మేనత్తలు అయిదుగురు. ముగ్గురు మేనత్తలు గారపాడు కోడళ్ళు. మొదటి ఆమె నాజరుకి పెద్దమ్మ అవుతుంది. పేరు పాతిమాబీ. రెండో ఆమె లాలూబీ. ఆమెనే నాజరు వాళ్ళు మా పెంచినమ్మ అనేవాళ్ళు. ఆమె వితంతువు, పిల్లలు లేరు. అందుకని నాజరును పెంచేది. మూడో ఆమె బీబాబీ. ఆమె మా బాజీ తల్లి. వాళ్ళు ముగ్గురు వచ్చారు మానాన్న దగ్గరికి. యేరా మీరా (మా నాన్న పేరు మీరా సాహెబ్) రెండు సార్లు పెళ్ళాడితే రెండుసార్లు అట్టా అయిపోయే. ఎవరూ పిల్ల నివ్వరైరి. ఇంక మేనమామవి నువ్వు కూడా పిల్లనివ్వకపోతే ఇంక వాడికి సంసారమెట్టా వంశమెట్టారా అని మా ముగ్గురు మేనత్తలు కళ్ళనీళ్ళు పెట్టుకున్నారు. యింటి ఆడపడుచులు కళ్ళనీళ్ళు పెట్టుకుంటున్నారు అని మొహం చూసి సరే అన్నాడు మా నాన్న.

ఈ విషయం తెలిసి మా పెదనాన్న ససేమిరా పిల్లని వాడికివ్వటానికి వల్లగాదన్నాడు మా నాన్నతో. ఆడపిల్లలు పుట్టింటి కొచ్చి కళ్ళనీళ్ళు పెట్టుకుంటున్నారన్నయ్యా యేం చెయ్యను అన్నాడు నాన్న. వాళ్ళు అట్టాగే పెట్టుకుంటారులే పెద్దపిల్లని యిచ్చావు యేం చేశాడు దాన్ని తెచ్చుకుని యింటో పెట్టుకున్నావు అన్నాడు. సరే అది దాని ఖర్మ అది సంసారానికి పనికిరాదని కళ్ళుపోతయి అని చెప్పబట్టి గదా అన్నాడు మా నాన్న. ఆడు ఆలికి కూడు పెట్టేరకం కాదు కొంప పట్టున వుండడు కమ్యూనిస్టు పార్టీ అంటా తిరుగుతూ వుంటాడు. యెప్పుడు యేమవుద్దో తెలవదు ససేమిరా నాకిష్టం లేదన్నాడు. మానాన్న వినలేదు.

మా పెదనాన్న నా దగ్గిరికొచ్చాడు. “అమ్మా ఆదంబి నువ్వు వొప్పుకోబాకు నాకు యిష్టం లేదు” అని చెప్పు అన్నాడు. “నాకేం తెలుసు పెదనాన్నా అంతా నాన్న యిష్టం” అన్నాను.

ఆ రోజు వినాయక చవితి. నేను కూర్చొని వున్నా. ఆయన వొచ్చి అడిగాడు నీకిష్టమేనా నేను బావని కదా. నా వయసు పెద్దది అని అడిగాడు. మా నాన్న యిష్టం నాకు తెలియదు అన్నాను. నాలుగేళ్ళ క్రితం మా అమ్మ అడిగితే అది చిన్నది నా వయసు యెక్కడ దాని వయసు యెక్కడ అన్నాడు. తరవాత ఆయనే తనంతట తాను అడిగాడు.

నన్ను పెళ్ళి చేసుకుంటానని యింట్లో వ్యవహారం జరగటం మా అక్క వింటూనే వుంది. ఆమె గురించి యెవరూ పెద్దవాళ్ళు పట్టించుకోలేదు. మా అక్క మా బావనే అడిగింది నా సంగతేంటి అని.

కాశింబీ నీకు జబ్బు జేస్తదని డాక్టరు చెప్పాడు. నిన్ను యేలుకుంటే నీకుపూర్తిగా కళ్ళు పోతయ్ నిన్ను కఱ్ఱ పుచ్చుకుని నడిపిస్తూ నేనెట్టా వుండగలను అన్నాడు మా బాజీ. నేను పెళ్ళి చేసుకుంటాను అని కరాఖండిగా చెప్పాడు.

మా అక్క యేడ్చింది. నాకీ రోగం యింతేనా నా ఖర్మ సంసారానికి పనికిరాను నాకు సంతతిలేదు అని యేడ్చింది. చాలా సేపు వాళ్ళు వాదులాడుకున్నారు. నేను విన్నాను కానీ నేను చిన్నదాన్ని గదా నాకు అప్పుడేమి అర్థం కాలేదు.

మా పెద్ద వాళ్ళతో పెద్దామెను కూడా నేనే సాకుతాను అని మాటిచ్చాడు. బాజీతో నా నిఖా అని మాత్రం నాకు తెలిసింది.

బాజీతో నా నిఖా పెద్ద యెత్తున జరగలేదు. ముప్పావలా నిఖా అది. ఆయన వుర్దూ మేళంతో గుఱ్ఱం యెక్కి రాలేదు. నాకు యిప్పుడు గుఱ్ఱం యేమిటి వొద్దు అని మంగలి మేళంతోనే నాకు నల్లపూసలు కట్టాడు. నన్ను అత్తగారింటికి పంపేటప్పుడు అందరూ యేడ్చారు. నాకు యేడుపే రాలేదు. ఆయన బతికున్నంతకాలం అనేవాడు యేడవకుండా నాతో కాపరానికొచ్చావే ఆదంబీ అదే నాకు జయం అనుకో అనేవాడు.

నా తొమ్మిదో యేట వొకసారి మా ఇంటికి అడుక్కునే సాధువు వొచ్చాడు. నా చెయ్యి చూసి నీకు పండితుడు దొరుకుతాడు అని చెప్పాడు. అది విని మా అక్కలు దూదేకుల సాయిబుల్లో పండితుడెవడే అని ఎగతాళి చేసి నవ్వేవాళ్ళు. నాకా సంగతి బాగా గుర్తు వుంది. నిఖా అయ్యాక ఆయన్ని అడిగాను "నాకు సాధువు నీకు పండితుడు దొరుకుతాడంటే మీరు దొరికారేంటి" అని అడిగాను. "యెవడో యేంటి నేనే పండితుడిని" అనేవాడు. కానీ నేను నమ్మేదాన్ని కాదు. దూదేకుల సాయిబుల్లో పండితుడెక్కడ దొరుకుతాడు అనుకునేదాన్ని. మా పుట్టింట్లో మా నాన్న అనేవాడు నాకూతురు సరోజినిదేవి అంతటిది కావాలి అని ముద్దుగా. మా నాన్న కాంగ్రెస్. అందుకని. కానీ నాకు పండితుడే దొరికాడు అని నమ్మా. యెప్పుడూ నాజరుకి పద్మశ్రీ యిచ్చినప్పుడు, డెబ్బయ్‌జతల ఎడ్లతో మమ్మల్ని వూరేగించినప్పుడు, సన్మానాలు చేసినప్పుడు. నాజరుగారి భార్య స్టేజిమీదకు రావాలి

అన్నప్పుడు యెప్పుడూ నా గుండె జల్లుమనేది. అప్పుడు నమ్మాను నేను కూడా పండితుడి భార్యనే అని అంత వరకూ ఆ సాధువు దూదేకుల పిల్లని మోసం చేసే మాటలు మాట్లాడాడనుకున్నాను. నేను పండితుడిని అని ఆయన అంటే ఆసికానికనుకున్నాను.

ఇంకా నాకు నిఖా జరిగి నిండా నెలకాలేదు. ఒకరోజు యెక్కడికో వెళ్ళాడు మళ్ళీ రాలేదు. నేను మా అత్త దగ్గరే ఉన్నాను. ఎన్నాళ్ళయినా రాలేదు. అందరూ అనే వాళ్ళు మీ ఆయన కమ్యునిస్టుల్లో జేరిపోయాడు అని.

మా అత్త అంతా గొడవలుగా వుంది. ఈ ఊళ్ళో వుంటే యేం జరుగుద్దో నువ్వు మీ పుట్టింటికి వెళ్ళు అని పొన్నెకల్లు నుంచి గారపాడు పంపేసింది. అందరూ యేడుస్తూ వుండే వాళ్ళు కానీ నాకు యేడుపురాలేదు. చిన్నతనం వల్ల తెలిసేది కాదనుకుంటా కానీ ఒక నెల కలిసి వున్నాం కదా అందుకని యెదురుచూస్తూ వుండేదాన్ని. బెంగగా అనిపించేది. ఇంక రాడా కనిపించడా అనుకునేదాన్ని. ఆఖరికి ఖైదులోకి వెళ్ళాక కూడా నేను ఏడవలేదు.

నేను అప్పుడు గారపాడులో వున్నా మాపుట్టింటో. మా గారపాడు లోనే మా ఆడపడుచుని యిచ్చారు. మా ఆడపడుచు అత్తగారి వూరు కూడా మా గారపాడే. ఆ రోజు మా ఇంట్లో చేపల కూర వండారు. ఇది తీసుకెళ్ళి మీ ఆడబిడ్డకి ఇచ్చి రమ్మన్నారు నన్ను. నేను వెళ్ళేప్పటికి ఇంట్లో యెవరూ లేరు. తలుపుతోసుకుని వెళ్ళాను. నేను వెళ్ళేప్పటికి భోషాణం పక్కన గోనె పట్టా పరుచుకుని పడుకుని వున్నాడు. నేను ఒక్కసారిగా దడుసుకున్నా. "దడుసుకోబాకు నేనేలే, రా" అన్నాడు. నేను భయం భయంగా వెళ్ళా. "ఇదేంటి ఇక్కడున్నా మీ చెల్లి వాళ్ళేరి" అని అడిగాను. "వాళ్ళు లేరులే వేరే వూరు వెళ్ళారు. నేను ఒక్కడినే వున్నానుగాని ఒక పని చేస్తావా" అని అడిగాడు. "ఏం పని" అన్నాను. పగలంతా యెక్కడికి కదలకుండా ఇంట్లోనే వుండటం వల్ల సీసాలో మూత్రం పట్టి వుంచాడు. అది వెళ్ళి బయట పారబోసి రమ్మన్నాడు. ఈయనేం మనిషబ్బా అనుకున్నా. రాక రాక వచ్చి రాగానే యిలాంటి పని చెపుతాడేంటా అని సరే యివ్వు పారబోసి వస్తాను అన్నాను. మళ్ళీ సీసా తెమ్మన్నాడు. నాకైతే తెగ నవ్వొచ్చింది.

నిన్ను పోలీసులు పట్టుకుంటారంటగా అని అడిగాను. అవును అన్నాడు. నాకు ఆ పార్టీ సంగతులు గాని ఈయన సంగతులుగాని ఏమీ తెలియవు. యేదో కంటికి కనపడ్డాడుగదా అనుకున్నా. రోజూ పగలు యెక్కడికో వెళ్ళేవాడు. రాత్రి మాత్రం నేను అన్నం తీసుకెళ్ళేదాన్ని. కానీ యెవరికి తెలియకుండా రహస్యంగా. నేను యిలా వొచ్చి వెళుతూ వుండటం మా పక్కయింటి ఆమె చూసింది. యేంటే పిల్లా రోజూ అటు వెళతన్నా అని మీ ఆయనగాని వొచ్చాడు అని అడిగింది. నీకెందుకు అవన్నీ అన్నాను. దాంతో మీరాసాయిబు అల్లుడు ఈ వూళ్ళోనే వున్నాడు అని వెళ్ళి మా వూరు కరణానికి చెప్పింది.

మరుసటి రోజు నేను ఆయన దగ్గరికి వెళ్ళి వొస్తూ వుండగా పోలీసు వ్యాను వొచ్చింది. యెట్టా పసిగట్టాడో ఆయన. అదే పోక. దొరకలా. తరవాత చెప్పాడు యెట్టాపారిపోయింది.

మాపెద్దనాన్న రోజూ మా నాన్నని తిట్టేవాడు. పార్టీలో తిరిగేవాడికి పిల్లనిచ్చావు. దాని గొంతుకోశావు. వొకళ్ళకిద్దరిని యిచ్చావు. యిప్పుడు యేడిస్తే యేమొస్తది అని. మా నాన్న కిమ్మనకుండా వుండేవాడు.

మొత్తంమీద ఆయన పట్టుబడ్డాడు. మా నాన్న కాంగ్రెస్. అందుకని మావూరి రెడ్డిగారితో చెప్పి ఆయన లొంగిపోయేట్టు చేశారు. కాని ఆయనని చంపేస్తారని అనే వాళ్ళు. అంతపని జరిగేదేనంట కాని నాకేమి తెలియదని పార్టీ వాళ్ళు యెక్కడికెళ్ళి కథలు చెప్పమంటే అక్కడికి వెళ్ళి కథలు చెప్పేవాడినని అంతేకాని పార్టీకి సంబంధించిన విషయాలు నాకు తెలియదని చెప్పాడంట. పాటలు పాడి వినిపించుకునేవాళ్ళంట. కాని వొకరోజు చంపుదామనే తీసుకెళ్ళారంట. ఎట్లాగో చావుతప్పింది అని చెప్పారు. మంగళగిరి జైల్లో వున్నప్పుడు మా అత్త వాళ్ళు చూద్దువురా అని నన్ను కూడా తీసుకెళ్ళారు. ఆయన్ని చూడగానే మా ఆడపడుచు మా అత్త యిద్దరూ కళ్ళనీళ్ళు పెట్టుకున్నారు. ఆయన్ని చూడగానే బావురుమని యేడ్చారు. నాకు యేమి యేడుపు రాలేదు. బాగా పెరిగిన గెడ్డంతో వున్నాడు. జైల్లో కమ్మీల వెనక నుంచుని వున్నాడు. నన్ను యెవరికో చూపించి ఆ పిల్లేనండి నా పెళ్ళాం అనడం మాత్రం నాకు గుర్తుంది. నన్ను దగ్గరికి పిలిచాడు. నేను నవ్వి యెప్పుడొస్తావు అన్నాను. మా నాన్న నువ్వు వొస్తే మంచి చేపలు తెస్తానన్నాడు అని మళ్ళీ అడిగాను. అయితే యెప్పుడొస్తావు అని ఆయన నవ్వాడు. నాకు పెరిగిన ఆయన గెడ్డం చూస్తే తెగనవ్వొచ్చింది. మా అత్త ఆడపడుచు చూడు దీనికెంత ధైర్యమో అన్నారు. కానీ నాకు అప్పుడు యెందుకేడవాలో వాళ్ళు యెందుకేడుస్తున్నారో తెలవలా. అయినా ఆయన కళ్ళ ముందు కనపడుతున్నారు తొందరలో వదిలేస్తారు అని చెప్పారు. ఆయన యెప్పుడూ అనేవారు నీనవ్వే నాకు జయమే అని. మొగుడున్నాడు, అన్నం వుంది, కట్టుకోడానికి బట్టలు యిస్తారు, పిల్లలున్నారు యింకెందుకేడవాలో నాకు అప్పటికి తెలియలా. కాలం మారింది నాబిడ్డలు పైకి వొచ్చారు. వాళ్ళ యిబ్బందులు చూస్తూ వుంటే యిప్పుడనిపిస్తుంది. బాగా డబ్బు సంపాయించాలి కాబోలని. ఆ రోజుల్లో కాస్త మంచి యిల్లు కట్టుకునేప్పటికి అదే తాటాకు పాకలో నుంచి మాకు పండగలా అనిపించింది. డబ్బులో పుడితేగదా డబ్బు కావాలని తెలియడానికి. పెద్ద కులపోళ్ళకే డబ్బులుంటాయనిగాని మనకి కూడా సంపాయిస్తే డబ్బులొస్తాయని తెలియదు. ఆయన జైల్లో నుంచి యింటికి వొచ్చాడు.

ఆయన జైలు నుంచి యింటికి వొచ్చాక నేను మా అత్తగారింటికి కాపరానికి వొచ్చాను. ఆయనకీ యేం పనిలేదు. మా అత్త పొలం పనులకి వెళ్ళేది. నన్ను కూడా పొలం రమ్మనేది.

నాకు పొలం పనులు యేమీరావు. మా నాన్న నన్ను యెక్కడికీ పంపలేదు. యింట్లోనే వుండేదాన్ని చిన్నదాన్నని బాగా చూసుకునేవాడు. మానాన్న యంత్రాలు మంత్రాల మీద సంపాయించి మమ్మల్ని పెంచాడు. కానీ మా అత్తవాళ్ళకి యేరోజు పనికి వెళ్ళకపోతే గడిచేది కాదు.

నేను కూడా వెళితే మనిషి కూలివస్తుంది కదా అని మా అత్త ఆశ. కాని నేను పొలం వెళ్ళటానికి యేడ్చేదాన్ని. అప్పుడు ఆయన కోప్పడేవాడు. వెళ్ళు అమ్మ వెళ్ళటల్లా పనికెళ్ళటానికి యేడుస్తావేమిటి అని కేకలేసేవాడు.

అసలు సంగతేంటంటే తొలీత వరి చేలో కలుపుకు తీసి కెళ్ళింది మా అత్త. వరిచేలో దిగా. కలుపు మొక్కకి వరి మొక్కకి తేడా తెలియలా నాకు. మా అత్తని అడిగా. ఆమె సరే తెలియకపోతే మానే యిదిగో నా వెనకాలే రా ఆ తుంగ మొక్కలు మాత్రం పీక్కుంటూరా అని మొత్తం దేవులాడి తీసే కలుపు ఆమె తీసుకుంటూ ముందు వెళ్ళేది. నేను తుంగమొక్క మొదలుకంటా బలంగా పీకాలి. అది జారి వేరు రాకుండా తెగిపోయేది అందుకని దాని మీద చుట్టూ వున్న మట్టి తీసి పీకిన తుంగ మొక్క మీద వేసేదాన్ని అలా వెయ్యటం వల్ల మునుం పట్టిన వాళ్ళు ముందు ముందు వెళ్ళి పోయేవాళ్ళు. మా అత్త కూడా ముందు వెళ్ళి రావేమే పిల్లా తుంగమొక్కకి వేళ్ళాడుతున్నావా అని కేకలేసేది. అట్టా కొన్నాళ్ళు గడిచాక నాకు మా మొదటి పిల్ల అలీనా కడుపున పడింది. యిక నేను పొలం పనులకు వెళ్ళటం మానేశాను. యింతలో నాజరు గారిని పార్టీ వాళ్ళు పిలిచారు.

మళ్ళీ బాజీని పార్టీ వాళ్ళు కథలు చెప్పమని పిలిచారు. యింతలో మాపెద్ద పిల్ల కడుపున పడింది. ఆయన మళ్ళీ పార్టీలోనే వుండేవాడు. కథలు కి వొచ్చేడబ్బులు యింట్లోకి, పార్టీకి యిచ్చేవాడు. ఇంట్లో యేం పట్టించుకునేవాడు కాదు. తెచ్చిన డబ్బు వాళ్ళ అమ్మకిచ్చేవాడు. అంతా ఆమెదే పెత్తనం. ఆ డబ్బు అగొడవ నాకేమి తెలియదు నాకేం కావాలన్నా మాఅత్త చూసేది. ఆమె బతికుండగా నేను డబ్బు కంటితో చూసి యెరగను. ఆమె చనిపోయాక నాకు యిచ్చేవాడు. వొచ్చింది వొచ్చినట్టు నా దోసిట్లో పోసేవాడు. యేంచేశావని అడిగేవాడు కాదు యేం పట్టించుకునేవాడు కాదు. అందులోనే పిల్లలందరినీ వొక వొడ్డుకుచేర్చా.

పొన్నెకల్లులో వుంటే రావటం పోవటం యిబ్బందిగా వుంది. కథలు చెప్పించుకునే వాళ్ళకి దగ్గరలో వుండాలని మేము గుంటూరుకి మకాము మార్చాము. మాతో పాటే మా అత్త కూడా వుండేది. అప్పుడు మా అక్క కాశింబీని పొన్నెకల్లు మా యింట్లో వుంచాము. మాకు అంతకు ముందు వొక రెండెకరాల పొలం వుంది. ఆ పొలం చూసుకుంటూ వుండేది. యెప్పుడన్నా డబ్బు కావాల్సి వస్తే వచ్చి అడిగి తీసుకుని వెళ్ళేది. ఆమెకు

కావాల్సిన వన్నీ ఆయనే చూసేవాడు. ఆమె మా పిల్లలని నా కంటే బాగా చూసుకునేది. మా పిల్లలకి యిద్దరు తల్లులు.

మా అక్క కాశింబీకి ఈర్ష్య వుండేదికాదు. నాఖర్మ గదా అనుకునేది. డబ్బులు, చీరలు ఆయనే తెచ్చేవాడు. ఆయన ఆమె పరాయివాళ్ళుగా మసిలేవాళ్ళు. నియమంగా వుండే వాళ్ళు. ఆమంటే ప్రేమే. యెప్పుడన్నా ఆయనతో మామూలుగా నాఖర్మ యిలా అయింది అని బాధపడితే దాన్ని గురించి ఆలోచించవద్దు అనేవాడు.

సలహాలు అన్నీ నాతోనే. యింట్లోయేం జరిగినా మేం యిద్దరమే చర్చించుకునే వాళ్ళం. మా అక్కని యేమీ అడిగేవాడు గాదు.

మా అక్క తరువాత మాతో పాటు వుండేది. కానీ యింటి పనుల్లో గాని చిన్న చిన్న విషయాల్లో గాని మేము తగాదా ఆడుకుంటే చాలు కర్ర పుచ్చుకునేవాడు. మేము హడిలిపోయేవాళ్ళం.

నాకు పదకొండు కానుపులు. పోయిన వాళ్ళు పోగా అయిదుగురు ఆడపిల్లలు యిద్దరు మొగ పిల్లలు మిగిలారు. నాకు వెంటవెంటనే కానుపులొచ్చేవి. బాగా నీరసపడిపోయేదాన్ని. యేమిరా అయ్యా యీ పిల్లకి యిట్టా వుంది ఆపరేషను చేయిస్తారా అనేది మా అత్త. ఆయన ససేమిరా వొప్పుకునేవాడు కాదు. యెందుకో తెలియదు. నాతో అనేవాడు అది అంత మంచిది కాదు వొంటికి అని. నిజమే కాబోలనుకునేదాన్ని. వొళ్ళువొస్తది. లేనిపోని రోగాలు అనేవాడు. అలానే అంత మందిని కన్నాను. వాటి అంతట కానుపులు అవే ఆగిపోయే వరకు కన్నాను. అట్లా పదకొండు కానుపుల్లో యేడుగురు మిగిలారు.

మా అత్త నన్ను బాగా చూసుకునేది. మా మూడో అమ్మాయి బంగారుపాప పుట్టిన తరువాత నాకు అప్పుడు టైఫాయిడ్ వొచ్చింది. నేను బతకనేమో అనుకున్నారు. అప్పుడు మా అత్త రోజూ నా దగ్గిర మీముందు నేను పోవాలే అని యేడ్చేది. మా అత్త చాలా కష్టజీవి యెప్పుడూ పొగాకు బేరన్‌కి వెళ్ళేది. యెప్పుడూ మానేది కాదు.

పార్టీలోంచి బయటికి వొచ్చాక బాజీకి కొన్నాళ్ళపాటు కథలు లేవు. యింట్లో జరిగేదికాదు. నేను మా అత్త యిద్దరమూ కలిసి పొగాకు బేరన్‌కి పనికి వెళ్ళేవాళ్ళము. చిన్న పిల్లని చంకనేసుకుని వెళ్ళేదాన్ని అక్కడ చిన్న పిల్లలను పడుకోబెట్టుకోటానికి వీలు వుండేది. కాని పిల్లలు యేడుస్తూ వుండేవాళ్ళు. ప్రాణం వుసూరుమనేది. కానీ ఇంట్లో జరగేదికాదు అందుకని వెళ్ళేదాన్ని. నేను పనిచేసిన కంపెనీని డాల్డా కంపెనీ అనేవాళ్ళు. యమ్.వెంకటేశ్వరరావు కంపెనీ అని కూడా అనేవారు. ఆ తరువాత ఆయన సంపాదనతోనే కాలూ చెయ్యీ కూడదీసుకున్నాక కంపెనీ పని మానేశాను. చిన్నపిల్లలు

యెడపిల్లలతో కుదిరేదికాదు. కానీ ఆ కంపెనీ వాళ్ళు నాకు అర్ధరూపాయి బాకీ వున్నారు. ఆ సంగతి నేను మర్చిపోయినా ఆయన మర్చిపోయేవారు కాదు. యిదిగో ఆ కంపెనీ వాళ్ళు నీకు అర్ధరూపాయి బాకీ వున్నారు. కంపెనీలు అంతే. కష్టార్జితం తెచ్చుకోపో అని నవ్వేవారు.

ఎప్పుడూ వెక్కిరిస్తూ వుండేవారు కష్టార్జితం అని.

నేను యెప్పుడూ ఆయన కథలు చెప్పేటప్పుడు వెళ్ళనూ లేదు చూడనూలేదు. నాకు యెప్పుడూ తీరేది కాదు. పిల్లలతోనే సరిపోయేది. కానీ ఆయన కథ చెప్పివొచ్చాక యీరోజు జనం వేశారు యీలలూ పూనకాలూ యింక చూడు నీళ్ళు పోసేవరకూ గోలగోల అనుకో అనేవాడు.

నేను చూడందే నమ్మను అనేదాన్ని. నేను చెపితే నమ్మాలోయ్ అనేవారు.

చూశాక నమ్ముతా అనేదాన్ని. తరవాత ఆయన కథ చెప్పటం చూశాను విన్నాను. సన్మానాలు జరిగినప్పుడు నన్ను పిలిచేవారు. తొలిసారిగా కథ విన్నాక అనుకున్నా అందుకే కాబోలు ఆయనకి యింత పేరు అని.

నేను కూడా ఆయనతో బాటు సన్మానాలకి వూరేగింపులకి వెళ్ళినప్పుడు గుంపులో కూర్చొని కథ వినేదాన్ని.

అప్పుడు రహస్యంగా చెప్పేవారు. బ్రాహ్మలు కూర్చునే చోట కూర్చోమనేవారు. వాళ్ళు యేమనుకుంటున్నారో విని నాకు చెప్పమనేవారు. కథలో సందు దొరికితే చాలు బ్రాహ్మలని బాగా తిట్టేవారు. నాకు భయమేసేది. యెవరు యేమనుకుంటారో అని. కానీ వాళ్ళు యేమీ అనేవాళ్ళుకాదు. ఈ నాజరుకి అంటే దూదేకుల వాడికి అన్నమాట యింత గాత్రం యిన్ని విషయాలు యెలా తెలిశాయో అని ఆశ్చర్యపోతూ వుండేవారు.

అదే ఆయనతో చెప్పేదాన్ని ఈ నాజరుకి యింత జ్ఞానం యెలా అబ్బిందా అనుకుంటున్నారయ్యా అని. నాకు కావలసింది అదే అని నవ్వేవారు. అయినా అలా బ్రాహ్మలని తిడతావేమిటి వాళ్ళకి కోపంరాదా. నీకేమన్నా అయితే అని అడిగేదాన్ని.

నవ్వేవారు. యేమీ కాదు. నేను చెప్పేదంతా నిజమని వాళ్ళకు తెలుసు. సత్యం చెప్పేవాడికి యేమీ కాదు. నేను నిజం చెప్పినంత కాలం నాకేం కాదు అనేవాడు. ఆయనకి వొక బ్రాహ్మణ స్నేహితుడు వుండేవాడు. ఆయన పేరు సుబ్బారావుగారు. బ్రాహ్మలకి సంబంధించిన వ్యవహారాలన్నీ యీయనకి ఆయనే రహస్యంగా చెప్పేవారు. ఆయన మంచి స్నేహితుడు.

బ్రాహ్మలకి సంబంధించిన విషయాలన్నీ ఆ సుబ్బారావుగారిని అడిగి తెలుసుకునే వాడు బాజీ. నాతో యెప్పుడూ అనేవారు బ్రాహ్మలు మనకి యేది వొద్దు అంటారో అవన్నీ మనం చెయ్యాలే అని.

మా ఇంటికి కమ్యూనిస్టు పార్టీ వాళ్ళు వొచ్చేవారు. వొకసారి పార్టీ వాళ్ళు యిళ్ళ స్థలాలు పంచుతున్నారు. కులాలవారిగా ప్లాటులు పంచుతున్నారు. నేను అడిగాను వాళ్ళని. పార్టీకి కులాలు లేవు అని చెపుతారు కదా మరి కులాలవారిగా స్థలాలు పంచుతున్నారే అని. వాళ్ళు అది అంతేలేమ్మా అనేవారు. అవును మరి పార్టీకి కులం లేదు గాని ఆస్తికి కులముందన్న మాటేగా మరి. యేదో ఈ కమ్యూనిస్టులు చెపుతారుగాని ఈ కులాలుపోవు ఆస్తులు పోవు. నేను అలా అని ఆయనతో అంటే అలా అనకు అన్నీ పోతయ్. రష్యాలో, చైనాలో బీదవాళ్ళు ధనవంతులు అనేవాళ్ళు లేరు. అలాంటి రాజ్యం మనకి కూడా వొస్తుంది అని చెప్పేవారు.

నేను చూడందే నమ్మను అన్నాను. ఏయ్ నేను చెపితే నమ్మాలోయ్ నువ్వు అనేవాడు. సరే నమ్ముతాలే చూశాక అనేదాన్ని. ఆయన వుండగా కూడా ఆ రష్యా చైనా చూడడం పడలేదు. యింక యిప్పుడేం చూస్తాను.

నన్ను కూడా సన్మానాలకి పిలిచేవాళ్ళు యెందుకయ్యా నాకీ సన్మానాలు అనేదాన్ని. కళాకారుల భార్యలందరూ కోపిష్టులుగా వుంటారు. కానీమీరు నవ్వుతూ వుండడం తప్ప కోపంగా వుండడం చూడలేదు. అందుకే మిమ్మల్ని కూడా పిలుస్తున్నాము అనేవాళ్ళు.

ఆయన యింట్లో యెప్పుడూ యేపనీ చేసేవాడు గాదు. ఆయనకి స్నానానికి నీళ్ళు కూడా నేనో మా అక్క కాశింబీనో తోడి పోసేవాళ్ళం. అవతల పుల్ల తీసి యివతల పెట్టేవాడు గాదు. కథకి వెళ్ళి వొచ్చాక ఆ డబ్బులు మాత్రం యిచ్చేవాడు అంతే. పురుగు తొలిస్తే పేకాట కెళ్ళేవాడు. మహా అయితే ఒక రూపాయితో పేకాట ఆడేవాడు. స్నేహితులు అందరూ అనేవాళ్ళంట. నాజరూ ఈ పైసా పేకాట మానవా అని. నేను పేక వ్యసనానికి ఆడటల్లేదయ్యా ఏదో కాలక్షేపానికి. నేను మాత్రం పైసా తప్ప పెట్టను. వచ్చినా రూపాయి పోయినా రూపాయి అనేవాడు. అందరూ నవ్వేవారంట. హార్మోనియం పెట్టె మీద కూర్చుని కూర్చుని కాస్త గాలి పీల్చుకోవాలనుకున్నప్పుడు పేకాట ఒకటి, ఇకపోతే ఆ కోడిపుంజులొకటి.

ఆయన యింట్లో చేసే వొకేవొక పని కోడిపుంజులను పెంచడం. యెప్పుడూ వాటిని చంకలో పెట్టుకుని తిరుగుతూ వుండేవాడు. ఎవరైనా జీడిపప్పు పెడతారు కోళ్ళకి అంత ఇది అయితే. కానీ ఈయన చూర్ణాలూ లేహ్యాలూ పెట్టేవాడు. ఆ డబ్బాలు ఇంకా ఉన్నయ్. కోడిపుంజులని బాగా తడిపేవాడు. యెందుకయ్యా అలా తడుపుతావు అంటే అలా తడిపితే పందేలు బాగా వేస్తాయి అని చెప్పేవాడు. నాకు అనిపించేది అలా కోడి పుంజులతో గడపడం వల్ల కోడిపుంజుల తగాదా గురించి బాగా చెప్పేవాడేమో అనిపించేది.

ఆయనకి కోడి కూర అంటే చాల యిష్టం. బాయిలరు కోడిగాని బాయిలరు

కోడిగుడ్డుగాని వండామా చట్టి ఇసిరికొట్టేవాడు. ఆయనకి నాటుకోడి మాంసం అన్నా నాటు కోడి గుడ్డు అన్నా చాలా ప్రాణం. ఇంట్లో వుంటే ఆయన పాడుకుంటూ యేవో రాసుకుంటూ వుండేవాడు.

ఆయన యెప్పుడూ బీదా బిక్కి గురించే మధన పడతా వుండేవాడు. మరి కమ్యునిస్టు పార్టీ నుంచి యెందుకు తీసేశారో ఆయనతో కథలు యెందుకు చెప్పించటల్లేదో నాకు తెలిసేది కాదు.

మళ్ళీ యెప్పుడో వొకసారి నేను విరసంలో చేరానే అని చెప్పాడు. యేంపార్టీ అయ్యా అని అడిగాను. యిది కూడా కమ్యునిస్టు పార్టీనే అని చెప్పాడు. వొకసారి యెక్కడో కంభంలోనో మాచెర్లలోనో అనుకుంటా విరసం మీటింగుకి వెళ్ళాడు. తిరిగి వొచ్చాక చెప్పాడు. మీటింగులో శ్రీశ్రీ మాట్లాడుతుంటే శ్రీశ్రీ దిగిపోవాలీ నాజరు స్టేజి మీదకి రావాలీ అని జనం కేకలు పెట్టారంట. నాజరుని జనం మర్చిపోలేదు ఆదంబీ అని ఆయన చెప్పాడు. నిజమే ఆయన జనాన్ని యెప్పుడూ మర్చిపోలేదు అందుకే జనం కూడా ఆయన్ని మర్చిపోలేదు. మరి పార్టీల వాళ్ళు యెందుకు ఆయన్ని మర్చిపోయారో నాకు యిప్పటికీ తెలియదు. కొన్నాళ్ళకి ఆయన్ని విరసం లోంచి కూడా తీసేశారు. యెందుకో మరి అలాంటి పెద్ద విషయాలు నాకు తెలిసేయి గాదు. కానీ కాలి బంగారు గండపెండేరం ఎక్కడి కెళ్ళినా తీసేవాడు గాదు. అది భీమవరంలో పెద్ద పెద్ద పండితుల సమక్షంలో ఆయనకి తొడిగారు. కథ చెప్పేప్పుడు గూడా అది వుండాలిసిందే కాలికి. ఒకసారి కలకత్తా వెళ్ళి వచ్చారు. అక్కడి నుంచి టాటానగర్ దాకా 15 ప్రోగ్రాములు. 1972లో అనుకుంటా. కలకత్తా ఆంధ్రసంఘం వాళ్ళు పిలిచారు. ఇంటికొచ్చిన బాజి కాలికి గండపెండేరం లేదు. థామస్ చెప్పాడు పెట్టెలో వుంది ఎక్కడికి పోలేదు అని. వీళ్ళు ప్రోగ్రాముల మీద ప్రోగ్రామిలిచ్చు కుంటూ కలకత్తానుంచి టాటానగర్ వెళ్ళేసరికి బంగ్లాదేశ్ యుద్ధం మొదలయిందంట. వీళ్ళ రైలు మూడు రోజులు నిలబడిపోయింది.రైలు దిగితే దొంగలు దోస్తున్నారు. అంతా అల్లకల్లోలంగా వుంది. కథ చెప్పించిన రైల్వే ఉద్యోగులు రైల్లో కొచ్చి నాజరుగారూ మీ క్షేమమే మా క్షేమం. మీ వంటి మీద వస్తువులు తీసి పెట్టెలో పెట్టండి పరిస్థితులు బాగాలేవు. వాటి కోసం ప్రాణాలు తీయొచ్చు దొంగలు అన్నారంట. ఎంత చెప్పినా కాలి గండపెండేరం మాత్రం తియ్యనంటే తియ్యనని మొండికేశారంట. ఉండేది మీరొక్కరే కాదుగదండీ మీతో పాటు వంతలు గూడా వున్నారు గదా అంటే అప్పుడు తీసి పెట్టెలో పెట్టారంట గండపెండేరం. మళ్ళా తొడగలేదు కాలికి.

ఆ మరసటి సంవత్సరం రాష్ట్రపతి భవనంలో ఢిల్లీలో ప్రోగ్రామిచ్చి బాజీ, థామస్ 58 రూపాయలు తెచ్చారు. ఇదే మా బాజీకి ఇచ్చిన హీనమైన ఈనాము. అమ్మో ఈ 58

రూపాయలు ఇచ్చినది ఎవరో తెలుసా అన్నాడు థామస్. ఎవరూ అన్నా. మన రాష్ట్రపతి వి.వి. గిరి గారి భార్య అమ్మా అన్నాడు. రాష్ట్రపతి ఇంటి లోపల సినిమా హాలు వుంది. అంత పెద్ద ఇల్లు అంట. ఆ సినిమా హాలులో కథ చెపుతున్నాము ఇంకేముంది మూటలొచ్చి పడతయ్ అనుకున్నారంట. 58 రూపాయలు ఇచ్చారు. మా బాజీ మాత్రం అర్ధనూటపదహార్లు చదివిచ్చారులే తిరువూరు గోపాల్ కంటే నయమే గదా అన్నాడు. మూడేళ్ళు వరసగా టిక్కెట్టు ప్రోగ్రాము పెట్టించాడు ఈ గోపాలు తిరువూరులో. మూడో ఏడు టిక్కెట్టులన్నీ అమ్ముకుని మనిషి పరారు. ఒకసారి వెంకట కిష్టాపురంలో కథ చెప్పి గ్యాసు లైటు తెచ్చారు అర్ధరాత్రి. నిర్వాహకులు దండుకుని పారిపోయారంట. వంతలతో సహా ఈయన ఇంకా స్టేజి మీద వున్నాడంట. ఆ చీకట్లో బస్సు దారి చూసుకోవటానికి స్టేజి మీద వున్న గ్యాసు లైటు తీసుకొచ్చారు. ఈయన మంచితనం చూసుకుని నెలరోజులకి ఆ పారిపోయిన వాళ్ళు గ్యాసు లైటు కోసం వచ్చారు. వాళ్ళ ధైర్యానికి ఈయన ఆశ్చర్యపోయి గ్యాసు లైటు ఇచ్చారు.

ఈయనకి పద్మశ్రీ ఇచ్చినప్పుడు ఆయనతో పాటు నేను మా పిల్లలు అందరం కలిసి ఢిల్లీ వెళ్ళాము. అక్కడ ఆయన యేదోగా వుండేవాడు. అందరితో కలిసేవాడు గాదు అంటీ అంటనట్టు వుండేవాడు. నాకు అనిపించింది. ఆయనకి కమ్యునిస్టుని యిక్కడికొచ్చానే అని వొక పక్క పీకిందేమో అందుకే అంటీఅంటనట్టు వుంటన్నాడేమో అని. నా అనుమానమే నిజమైంది.

తిరిగి వొచ్చాక "ఆదంబీ ఈ పద్మశ్రీలు అన్నీ కలిపి నాకు జనం వేసే వొక్క ఈలతో సమానం గాదు" అన్నాడు. ఢిల్లీ వెళ్ళినప్పుడు మేము మొత్తం వంతలతో సహా పదముగ్గురము వెళ్ళాము. మాకు తెలియదు అంత మందిమి వెళ్ళకూడదని. బాజీకి నాకూ మాత్రమే రూమిచ్చారు. మిగతా వాళ్ళు యెక్కడుండాలీ. తెలియలా. ఆయనకు కోపం వచ్చింది. తెలిసిన వాళ్ళు యెవరూ లేరు ఢిల్లీలో. యన్.టి.రామారావుకి ఫోను కొట్టాడాయన. విషయం తెలిసి యన్.టి.రామారావు ఫోన్ల మీద చెపితే మాకు వెంటనే అందరికీ మంచి వసతి కలిపించారు. మాకు మంచి హోటలు గదులు చూపించి సాయం చేశారు. నాజరు మీద యన్.టి. రామారావుకున్న అభిమానం అలాంటిది. నేను యన్.టి.ఆర్. అభిమానిని. కళాకారుడు కదా. వొకసారి రామారావు గుంటూరు మీటింగుకి వొచ్చాడు. మాపిల్లలందరూ చూడటానికి వెళ్ళారు. మా పిల్లలు యన్.టి.ఆర్ అభిమానులు. నేను కూడా అతని అభిమానినే. వెళ్ళి మేము నాజరు గారి పిల్లలము మీ అభిమానులము అని చెప్పారు. ఆయన "నేను నాజరు గారి ఫాన్ నమ్మా" అని చెప్పారంట. వాళ్ళకి చాలా ఆనందం వేసింది.

ఢిల్లీ వెళ్ళినప్పుడు అక్కడికి రాజీవ్‌గాంధీ కూడా వచ్చాడు. నాకు రాజీవ్ గాంధీని చూడాలనిపించింది. జనమంతా బారులుగా రాజభవన్‌లోకి వెళుతున్నారు. నేను కూడా వాళ్ళ వెంటబడి లోపలికి వెళ్ళాను. ఆయన్ని బయటే వదిలేసి. అంత పెద్ద గదుల్లో లోపలికెళితే అసలు బయటికి రాగలమా అనిపించింది. అయినా తెలిసిన వాళ్ళ వెంటబడి వెళ్ళాను. రాజభవన్‌లో పెద్ద టేబుళ్ళ మీద తిండి వుంది. వొక్కటీ తినేదిగా లేదని అనుకున్నా. ఆ టేబుళ్ళ మీద కత్తులు చాకులు అంటే కాయలు కమ్మలు కోసుకునేదన్నమాట చూసి వొచ్చా. అయ్యన్నీ ఆటితో తింటారు గాబోలు. రాజీవ్ గాంధీని చూశా యెట్టకేలకు. మొత్తం తిరిగి వచ్చా ఈ లోపల బయట నాకోసం ఆయన గాబరాపడుతూ కనిపించాడు. "యేమైపోయావ్ నీకోసం నేను వెతుక్కుంటున్నా" అని అన్నాడు ఆయన. "నేనేం మారిపోలేదులే బారుగా వెళ్ళి బారుగా వచ్చా" అని చెప్పాను. నాకు ఆ రాజభవనం చూసి కళ్ళు తిరిగినంత పని అయింది. అంత పెద్ద లోగిట్లో యీళ్ళంతా యేం చేస్తారా అని అనిపించింది. అదే అడిగా "బాజీ యిక్కడ కూర్చొని యేం చేస్తారు" అని.

"ఇక్కడే పెద్ద పెద్ద యవ్వారాలన్నీ జరిగేది. లేనోళ్ళ గోచి గుడ్డలు ఎట్ట ఊడ బీకాలా అని ఇక్కడ కూచోని ఆలోచిస్తారని" అన్నాడు.

మా పెద్దల్లుడంటే ఆయనకి చాలా ఇష్టం. యెందుకంటే మా పెద్ద అమ్మాయి అలీనాని కావాలని అడిగి చేసుకున్నాడు. మా అమ్మాయి కూడా బాగానే చదువుకుంది. మా అల్లుడు షేక్ కబీరు యింజినీరు. నాకు నాజరు గారి అల్లుడంటే చాలు అని అన్నాడు.

సరే మా చిన్న అమ్మాయి శివాజీ బేగం ఆమెను మా పెద్దల్లుడుకి బంధువలబ్బాయి ఆమెను పెళ్ళిచేసుకున్నాడు. మా చిన్న అల్లుడు బాబూజీ లాయరు.

ఇంక చిన్న పిల్లలు బంగారుపాపని, బాబీని యిద్దరినీ మా సొంత అన్న కొడుకులకి యిద్దరికీ యిచ్చి చేసాను. మా అన్న ఆసన్ సాహెబ్. ఆయనకి మా పెదమామ పెద్ద నాజరు కూతురిని యిచ్చారు. ఆ రకంగా మాకు రెండిందాలా కలిసిన సంబంధం.

ఇకపోతే మా పెద్దబ్బాయి షేక్ సయ్యద్ బాబు వాడి భార్య పేరు సైరాబాను. యింక రెండోవాడు బాబూజీ బి.యస్‌సి చదివాడు. వాడి భార్య పేరు బాజి. పిల్లలిద్దరికీ అబ్బింది ఆళ్ళ నాయన విద్య.

మా ఇంట్లో పిల్లలందరు బాగా పాడతారు. ఇంగవ కట్టిన గుడ్డ కదా. వాసన ఎక్కడికి పోతుంది? ఇప్పుడు ఆ బుర్రకథ రోజులు పోయాయి. మా అబ్బాయిల్నీ ఎక్కడెక్కడి నుంచో ఇప్పటికీ పిలుచుకెళతారు కథలు చెప్పడానికి. ఆయనకి జనంలో అంత పేరంటే ఆయన జనం మనిషి పార్టీ మనిషిగా బతికాడు అందుకే అంతపేరు. ఆయన బతుకంతా పోరాడాడు. అందుకే ఆయనకి జనమే భుక్తి గడిపారు. నాజరంటేనే జనం అనేవారు.

అందరికంటే ఆఖరికి పుట్టిన అమ్మాయి సితారా బేగం. ఆమె భర్త పేరు నబి.

ఇంటి విషయాలు గాని పిల్లల విషయాలు గాని ఆయన యేమి పట్టించుకునేవాడు గాదు. ఆఖరికి పిల్లలకి పెళ్ళిళ్ళ విషయం కూడా పట్టేదికాదు. అన్నీ నేనే చూసుకోవాల్సి వచ్చేది. యెవరినీ యేమీ అడిగేవాడు కాదు. నిమ్మకు నీరెత్తినట్టు వుండేవాడు. ఇంక ఈయనతో పనిగాదులే అని నేనే తలకెత్తుకున్నాను.మా అలీనా అంటూ వుండేది మా అమ్మ పూనుకుని మాకు పెళ్ళిళ్ళు చేయకపోతే మాకు మా నాన్న పెళ్ళిళ్ళు కూడా చేసేవాడు కాదని. ఆయనకి అడగడమంటే చిన్నతనంగా వుండేదేమో. అందుకే అంతా అయినవాళ్ళ తోనే యెక్కువ సంబంధాలు కలుపుకున్నాను. అంతా బాగున్నారు. మంచి అల్లుళ్ళు మంచి కోడళ్ళు. నాకేం కొరత లేదు.

మేము దూదేకుల సాయిబులం కదా. పేరుకి సాయిబులం అంతే. వలస సాయిబులు అసలు మమ్మల్ని కలుపుకోరు. పీర్ల పండగ చేసుకుంటామా వాళ్ళు మా అల్లా అంటారు గాని మన అల్లా అని చస్తే అనరు. వాళ్ళ కళ్ళకి మేము తక్కువన్న మాట. మేము హిందువుల పండగలు కూడా చేసుకుంటాము. వినాయకచవితి, కార్తీక పౌర్ణమి.

ఇలాంటి పండగలు చేసుకుంటాము.

మా దురదృష్టం ఆయనకి జబ్బు చేసింది. పాసు బిగబట్టిపోయినయ్ ఒక రోజు డాక్టరు దగ్గరికి తీసుకెళ్ళాము. ఆయన ఆపరేషను చేశాడు. కానీ ఆయనకి తగ్గలేదు. పాసు ఆగకుండా బొట్టుబొట్టుగా పడుతూ వుండేది. లోపల లంగోటీ బిగించుకునేవాడు. రోజు ఆయన బట్టలన్నీ యింటి దగ్గర మా అక్క కాశింబీ వుతికి ఆరేసేది. ఆయన పనులన్నీ చూసి పెట్టేది. కథలు చెప్పటం మానేశాడు. యెప్పుడన్నా సన్మానాలకి బయటికి వెళితే ఆయన వెంట నేను వెళ్ళేదాన్ని. అక్కడ రూముల్లో బట్టలన్నీ నేనే వుతికి ఆరేస్తూ వుండేదాన్ని అవన్నీ చూసి నా అదృష్టమే ఆదంబీ అనేవాడు. మీరు అక్కా చెల్లెళ్ళు యిద్దరూ నన్ను పసివాడిలా సాకుతున్నారు అనేవాడు.

మా చిన్న కొడుకు బాబూజీని వంత చేసుకున్నాడు. తరవాత అతనే సొంతంగా కథలు చెప్పేవాడు. బుర్రకథ ప్రాక్టీసు చేసేవాడు. 'అట్టిదేశాన' అని ఒక రాగసాయ వుంది. ఆ రాగసాయ యక్షగానంలో ఒక రకంగానూ బుర్రకథలో ఒకరకంగానూ వుండేది. ఇంకా రకరకాలుగా వుండేది. అది నేర్పుతా మధ్యమధ్యలో అదిగో యక్షగానంలో పాడు 'అట్టి దేశాన' అనేవాడు. మా వాడు తడబడేవాడు. వెంటనే ఆ రాగసాయ మార్చాల్సి వొచ్చేప్పటికి. ఆయన మా బాబూజీతో చెపుతూ వుండేవాడు. అరే కథలు కాలానికి అనుగుణంగా మార్చుకోవాలిరా అని. నేను నా కాలానికి అనుగుణంగా మార్చుకుని రాసుకుని పాడాను. నువ్వు కూడా కొత్తగా కథలు యెన్నుకుని రాసుకుని చెప్పాలి అనేవాడు.

ఆయన కాలానికి అనుగుణంగా మారాలి అని చెప్పేవాడుగాని మారిస్తే ఒప్పుకునేవాడు గాదు. నేను ఇంత కష్టపడి చేసిందాన్ని నువ్వు ఒక్క చిటికెలో మార్చేస్తావా అని ఆయనకి కోపం వచ్చేది.

ఒకరోజు ఆయన ఏర్పరుచుకున్న ఆహార్యం మార్చాడు వాడు. అంతే అలిగి ఒకరోజంతా అన్నం మానేశాడు. వీడు యేం మారిస్తే ఆయనకి యేం నచ్చలేదో. ఆ తరవాత మా బాబూజీ యేం మార్చినట్టు లేదు. నెత్తిన తురాయి మాత్రం పెట్టడు. అది నాజరుకి ప్రజలు అభిమానంతో బహుమానంగా ఇచ్చింది గదా అందుకు.

మా పిల్లలు అంటారు 'నాజరు గారి పిల్లలు అంటే చాలు గదమ్మా మాకు' అని. నాకైనా అంత కంటే కావలసింది యేముంటుంది.

ఆయనకి ఆరోగ్యం బాగాలేకుండా అయిపోయింది. మాకు కష్టకాలం వచ్చినట్టుగా అనిపించింది. ఆయన పూర్తిగా కథలు చెప్పటం మానేశారు. బయటికి వెళ్ళటం మానేశారు. కానీ అప్పుడే ఆయనకి పద్మశ్రీ యిచ్చారు. సన్మానాలు చేశారు. గండపెండేరాలు తొడిగారు. యెన్నో చూశాను ఈ కళ్ళతో. మంచి చెడు అన్నీ.

నేను మా అక్క కాశింబీ ఇద్దరమూ కూడా ఆయనకి సేవలో యేలోటు జరగ నివ్వలేదు. మా అక్క ఆయనకి చాలా చేసింది.

ఆయన కథలు చెప్పటం లేదు కదా యేమన్నా లోపంగా దిగులు పడతారేమో అనుకునేదాన్ని. కాని ఆయన దాన్ని లోపంగా భావించలేదు. చదువుకునేవారు. ఏదో పుస్తకం రాయాలని దాన్ని అచ్చు వేయాలని యెప్పుడూ చదువుతూ వుండేవారు. ఆయనకి చదువులోనూ రాతలోనూ కూడా మా పెద్దమ్మాయి అలీనా సాయపడేది. ఆయన యేం రాసినా మా అలీనా చూడాలి చదవాలి బాగుందని మెచ్చుకోవాలి అనేవాడు. వాళ్ళిద్దరు స్నేహితుల్లాగ వుండేవారు. ఆయన రాసిన పుస్తకం పేరు 'జాతి జీవితం – కళా పరిణామం.'

ఆయన ఆ పుస్తకం అచ్చు వేయాలని చాలా తపించారు. పుస్తకం అచ్చు వేశాక నేనే అమ్ముకుంటానురా. బస్సుస్టాండ్‌లో నిలబడి నేను నాజరుని నేను రాసిన పుస్తకం అని ప్రజలకి అమ్ముకుని బతుకుతానురా అనేవాడు. "ఒరే ఈ నాజరు జనం కోసం బతికాడురా జనం నాజరుని బతికిచ్చారురా. యెప్పుడూ జనాన్ని నమ్ముకో. పెద్దలు ప్రభుత్వాలు అవన్నీ నీ కళకి చెక్క అవార్డులు యివ్వటానికి పనికి వస్తారురా" అనేవాడు. కళాకారుడికి పట్టెడు అన్నం పెట్టేది జనం.

నాకెప్పుడూ అనిపిస్తూ వుంటుంది. చిన్నప్పుడు పోలీసులు పట్టుకెళ్ళినప్పుడే చచ్చిపోవాలిసింది ఆయన. కానీ బతికి తంబుర పుచ్చుకుంటాడనుకోలా మేము. కళాకారుడవబట్టే బతికాడేమో. గద్దర్ చూడు గుండు దెబ్బ తగిలినా కోలుకున్నాడు

కళాకారుడు మరి. జనం మెచ్చిన కళాకారులకి చావులేదు. జరగాల్సింది యేమిటంటే జనం మెచ్చటం.

మా అత్త అనేది "ఒరే నాజరూ నువ్వు ఏమన్నా చెయ్యి జనం నాజరు కమ్యునిస్టు కాకుండా అయిపోయాడు అని మాత్రం అనకూడదురా. నాజరు వొక అమ్మకి అబ్బకి పుట్టాడురా అనిపించుకో చాలు. మాకు మడులొద్దు మాన్యాలొద్దు" అనేది.

మాకు ఆయన మణులు మాణిక్యాలు యేమి యివ్వలేదు. యిదిగో ఒక ఇల్లు అమిరింది. పిల్లలకి పెళ్ళిళ్ళు చేసిపంపగలిగాము అంతే. యెవరి రెక్కలు వాళ్ళవే. మాకు మిగిలింది వొక్కటే జనం అభిమానం. అంతకంటే యేంకావాలి.

ఇదిగో ఆయన గుర్తుగా ఈ శాలువా ఒకటి దాచుకున్నాను. ఆయనికి కప్పిన శాలువాలు తలావొకటి యెత్తుకుపోగా.. ఆయనకి మూత్రం దగ్గిర దుర్మాంసం పెరిగింది. మూడు రోజులు మూత్రం రాలేదు. ఒకరోజు పడిపోయారు. ఆపరేషనుకి 25 వేలు అవుతుందన్నారు. డాక్టరు కాసరనేని సదాశివరావు గారి కోడలు వల్లీరాణి. ఆమె కూడా పెద్ద డాక్టరే. బ్రెయిన్ శ్కానింగ్ చేశారు. పెద్దమ్మాయి డాక్టరు రమాబాల కూడా చూశారు. ఆయన 1997 ఫిబ్రవరి 11 నుంచి రోజూ ఒక అరటిపండు ఒక ఇడ్లీ తోనే గడిపారు. అచ్చుకిచ్చిన పుస్తకం ప్రూఫులకొచ్చింది. దాంట్లో బొమ్మలన్నీ వేసింది మా బాబూజీయే. అప్పుడాయన ఇంట్లోనే మంచం మీదున్నారు. నీకెందుకు నాన్నా నేను చూస్తానని మా అలీనా అన్నా కూడా వినలేదాయన.

రాత్రి అయితే కళ్ళు కనపడవు. పగలే యేం చేసినా గాని. యెక్కువ శ్రమ పడితే ఆయన వొళ్ళు వోర్చుకోలేక పోతుంది. కానీ అచ్చు కిచ్చిన పుస్తకం ప్రూఫులు దిద్దుతున్నారు. ఈ రోజు ఇవి దిద్దటం అయిపోవాలి అని ఏకబిగిన కూర్చుని చేస్తూనే వున్నారు. మధ్యాహ్నం 12 నుంచి రాత్రి 7 దాకా ఆ కాగితాలపై మొహం పెట్టి కళ్ళల్లో నీళ్ళు తుడుచుకుంటూనే ప్రూఫులు దిద్దారు. మీరే దిద్దాలా యెవరన్నా దిద్దరా అంటే వినలేదు. నా పుస్తకంలో తప్పులు ఒప్పులు నాకే తెలుస్తాయి అని అదే పనిగా కూర్చుని చేశారు. అదే ఆయన చేసిన ఆఖరు పని. మాపిటాల అయ్యేప్పటికి పడిపోయారు. ఆసుపత్రికి తీసుకెళ్ళాము. తలలో రక్తనాళాలు చిట్లాయని చెప్పింది డాక్టరమ్మ. రక్తం గూడు కట్టింది. 21వ తేదీ తెల్లవారి ఫిట్స్ లాగా వచ్చింది....



# యుగధర్మం

**నా**జరుకి పింజారీ అనేది తిట్టూ కాదు. పద్మశ్రీ అనేది బిరుదూ కాదు.

నిజానికి పద్మశ్రీ అనేదానికన్నా పింజారీ అనడంలోనే లైఫ్ వుంది.

పూలమొక్క బోల్డు పరాగరేణువులను వెదజల్లుతుంది కానీ అందులో పూసేది కాసేది వొక్క రేణువే. అట్లా కాలానికి వొక కళాకారుడు పుడతాడు. నీళ్ళు పోసిన మాలి తనవల్లే ఆ పువ్వు పుట్టిందని అనుకుంటాడు. కంచె కట్టిన వాడు తనవల్లే ఆ పువ్వు పుట్టిందని అనుకుంటాడు. పిట్ట తోలినవాడు తనవల్లే ఆ పువ్వు పుట్టిందని అనుకుంటాడు. కానీ పువ్వుకి తెలుసు తనను ప్రకృతి సృష్టించిందని. అట్లాగే కళాకారుడికి కూడా తెలుసు తనను ప్రజలు సృష్టించారని. ఇట్లాంటి కళాకారులను మాలీల దృష్టి నుంచి చూడడం పాపం.

పెద్దనగారు గండపెండేరం తొడిగించుకున్న కాలానికి పింజారీ వూరవతల వున్నాడు. పింజారీ గండపెండేరం తొడిగించుకునే కాలానికి పెద్దనగారు పెద్దమనిషి అయి యివన్నీ తప్పురా అంటే – కాలం చిన్న బుచ్చుకోదా.

**అరుణ**

**ఉప్పులూరు,**

**31-12-2000.**

PINZARI (Shaik Nazar's Autobiography)



తెలుగు సాంస్కృతిక రంగానికి ప్రజానాట్యమండలి అందించిన ఆణిముత్యాలలో నాజరు ఒకడు. అట్టడుగున జన్మించిన నాజర్ "బుర్రకథ సామ్రాట్"గా ఇంత ఉన్నతస్థితికి ఎలా రాగలిగాడు? అది తెలియాలంటే "పింజారి" పుస్తకం చదివి తీరాల్సిందే. ప్రతి కళాకారుడు, కళాకారుడు కావాలనుకొనే ప్రతివాడు చదవవలసిన పుస్తకం "పింజారి". నాజరు, ఆయన కుటుంబ సభ్యులూ చెప్పిన విషయాలను అక్షరీకరించిన డా॥అంగడాల వెంకట రమణమూర్తిగారు అభినందనీయులు. సరళమైన, సహజమైన భాష, చక్కని వాక్యాలు, పరితులను పుస్తకం ఆసాంతం చదివించే తీరు ... మరింత అభినందనీయం.

**నల్లూరి వెంకటేశ్వర్లు**

గౌరవ అధ్యక్షులు, ప్రజానాట్యమండలి

₹ 65/-



విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్

చంద్రం బిల్డింగ్స్, చుట్టుగుంట, విజయవాడ-520 004